# ముందడుగు




— రచన —

సుంకర సత్యనారాయణ • • వాసిరెడ్డి భాస్కరరావు

# ముందడుగు





రచన:

సుంకర సత్యనారాయణ

వాసిరెడ్డి భాస్కరరావు



విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ-2.

# స్టేజికి సూచనలు

నాటకాలు వేయడానికి ప్రతివూళ్లోను నాటకశాలలుండవు. కాబట్టి బహిరంగ ప్రదేశాల్లో వేయవలసివుంటుంది. అందుకు స్టేజి నిర్మాణాన్ని గురించి తెలుసుకోవడం అవసరం.

స్టేజి ఎత్తు $1\frac{1}{2}$ అడుగులుండాలి. బల్లలతోటిగాని, వెదురు వాసాలతోగాని, మట్టితోగాని నిర్మించవచ్చు. వెడల్పు 15 అడుగులు; పొడవు 9 అ; ఎత్తు $7\frac{1}{2}$ అ; సైడు కర్టెనులు ఒక్కొక్కటి 3 అ. వెడల్పు చొ॥న $7\frac{1}{2}$ అ. యెత్తు ఉండాలి. శబ్దం హెచ్చుచేయడానికి నాలుగు కుండలు పందిరిమీద బోర్లించాలి. ముందు ప్రేక్షకులకు అవి కన్పించకూడదు.

తెరలు సీనరీతో అద్దెకుతేవడం కష్టం. తెచ్చినా ప్రతి దృశ్యానికీ సరిపోయే తెరలు లభ్యంగావు. అందుచే ఆ యా దృశ్యాలలోని ప్రధాన భావాలను, రసాలను ద్యోతకం చేసేవిగామాత్రమే రంగుల తెరలుండాలి.

ఎర్ర తెర — యుద్ధం, క్రోధం, వైరం
తెలుపు — శాంతం
గులాబీ — శృంగారం
పసుపు — కల్యాణం
నలుపు — దుఃఖం, కుట్ర

| రంగం | పాత్రలు | తెర | వస్తువులు |
| --- | --- | --- | --- |
| 1 | చక్రధర్రావు, నాగేంద్రం వెంకన్న, కోటయ్య వీరయ్య, పుల్లయ్య, కాసిం, అచ్చయ్య, నారాయణరావు | నలుపు | సిరిచాప, రాతబల్ల, కలం, సిరా బుడ్డి దత్రుం. |
| 2 | చక్రధర్రావు, వెంకన్న, రామ్, మోహన్, నాగేంద్రం. | తెలుపు | తివాచీ, 2 బల్లలు, 3 కుర్చీలు, ఒక కుషన్ చెయిర్, టేబుల్, సుగంధ ద్రవ్యాలు, బ్రాందిసీసా. 3 గ్లాసులు. చిత్రాలు, చీట్లపేక రు. 100నోటు, సిగరెట్లు అగ్గిపెట్టె. |
| 3 | నారాయణరావు, పుల్లయ్య కాసిం, శాంతమ్మ, విమల. | నలుపు | రాట్నం, పీట, ఎర్రట్ట, పుస్తకం. 2 గ్లాసులు, పాలు, నులకమంచం దండెం, బొంతపువ్వు, సంచి. |
| 4 | విమల, అచ్చయ్య. | తెలుపు | పుస్తకం, బల్ల, క్రోటన్స్, గ్లాసు. |
| 5 | చక్రధర్రావు, రామ్, నాగేంద్రం, వెంకన్న. అచ్చయ్య | తెలుపు | 2 వ సీనులో రు 100 నోటు మినహా. |
| 6 | నాగేంద్రం, శాంతమ్మ, పిల్లి భీముడు, ఇద్దరు రౌడీలు, పుల్లయ్య, వీరయ్య, కోటయ్య, కాసిం, నారాయణరావు | నలుపు | కత్తిపీట, కూరగాయలు, లాఠీలు, ఫొటోలు, పుస్తకాలు, రాట్నం, వంటసామగ్రి, దండెం, మంచం |
| 7 | విమల, అచ్చయ్య | తెలుపు | పుస్తకం, టేబులు, కుర్చీలు. బీరువా, అద్దం |

U

| | | | |
|---|---|---|---|
| 8 | శాంతమ్మ, నారాయణరావు<br>విమల, పుల్లయ్య | తెలుపు | చిన్నమూట, మిగతావి 3వ సీనులో<br>వలె పాలు, బొంతపువ్వు తప్ప |
| 9 | చక్రధర్రావు, రామ్,<br>మోహన్, వెంకన్న,<br>నాగేంద్రం, అచ్చయ్య | తెలుపు | 5 వ సీనులో వలె |
| 10 | ఇద్దరు పోలీసులు,<br>శాంతమ్మ, నారాయణరావు,<br>పుల్లయ్య, కోటయ్య,<br>వీరయ్య | నలుపు | సంకెళ్ళు |
| 11 | శాంతమ్మ, విమల-వీరయ్య,<br>కోటయ్య, కాసిం | ఎరుపు | 3 వ సీనులో వలె |
| 12 | చక్రధర్రావు, నాగేంద్రం<br>కాసిం, వీరయ్య, కోటయ్య,<br>అచ్చయ్య | ఎరుపు | 2 వ సీనులోవలె |
| 13 | శాంతమ్మ, విమల<br>అచ్చయ్య, వెంకన్న | తెలుపు | పేపరు, ఉత్తరం, పూలబుట్ట, పుస్త<br>కాలు, టేబులు, కుర్చీలు, అద్దం,<br>దువ్వెన |
| 14 | శాంతమ్మ, విమల<br>పుల్లయ్య, నారాయణరావు,<br>కాసిం, వీరయ్య, కోటయ్య | తెలుపు | మినపపప్పు, చాట, జెండాలు. |
| 15 | నారాయణరావు, పుల్లయ్య,<br>వీరయ్య, కాసిం, కోటయ్య<br>నాగేంద్రం, ఇద్దరురౌడీలు<br>అచ్చయ్య, విమల,<br>శాంతమ్మ, డాక్టరు. | నలుపు | నల్లముసుగుగుడ్డలు, కత్తి తాళ్లు,<br>కర్రలు, మంచం, దిండు, గొన్సు<br>గ్లాసు, మెడికల్‌బేగ్, స్టెత<br>స్కోప్, కుర్చీలు. |

| | | | |
|---|---|---|---|
| 16 | నారాయణరావు, విమల, అచ్చయ్య, రైతులు. | పసుపు | పేపరు, పుస్తకం, కప్, సాసర్, జెండా, టేబులు, కుర్చీలు. |



6

# పాత్రలు

నారాయణరావు – కథానాయకుడు, వయస్సు 25 సం॥

పుల్లయ్య<br>కోటయ్య<br>వీరయ్య<br>కాసిం } రైతులు

అచ్చయ్య – ధనిక రైతు, వయస్సు యాభై.

చక్రధరరావు – జమీందారు, వయస్సు ముప్పైఅయిదు.

నాగేంద్రం – ఠాణేదారు, వయస్సు నలభైఅయిదు.

రామ్,<br>మోహన్ } – జమీందారు స్నేహితులు

వెంకన్న – జమీందారు బంట్రోతు

పిల్లిభీముడు – రౌడీల నాయకుడు

1 వ రౌడీ

2 వ రౌడీ

శాంతమ్మ – నారాయణరావు తల్లి. వయస్సు యాభైరెండు

విమల – అచ్చయ్య కూతురు. వయస్సు పదహారు

సమయానుకూలంగా డాక్టరు మొదలైన పాత్రలు వుంటాయి.

1113

# 1

## లక్ష్మీపురం – జమీందారు ఠానా

[ఎత్తయినఅరుగులు - ఒక అరుగుమీదసిరిచాప పరచివుంటుంది. దానిమీద రాతబల్ల - కలం - సిరాబుడ్డి - ప్రక్కన దస్త్రం. నాగేంద్రం లెక్కలు చూచుకుంటూ వుంటాడు.]

నాగేంద్రం : ఎవడురా అక్కడ ?

(వెంకన్న ప్రవేశించి దణ్ణంబెట్టి నుంచుంటాడు)

నాగేం : ఇప్పుడుదాకా యెక్కడ జచ్చావురా ?

వెంకన్న : (సరిగ్గా వినపడక) అంతా వత్తన్నారండీ ?

నాగేం : అరే చెవిటివెధవా, ఇప్పటిదాకా యేంచేస్తున్నావురా ?

వెంక : ఓ ఆరెక్కడ కదుల్తురండీ, పాలుదీసివత్తా అని ఒకాయన, సద్దిదాగివత్తా అని ఒకాయన, వత్తాపదమని ఒకాయన, తలకోమాట. నన్నేం సావమంటారా? తిరిగీ తిరిగి నాదుంపతెగితేనూ.

నాగేం : చూడరా వస్తున్నారేమో

(కోటయ్యా, వీరయ్యలు ప్రవేశించి నాగేంద్రానికి దణ్ణంబెడతారు)

నాగేం : ఏమయ్యా, మీరు సుష్ఠుగా తినీ తేపి అచ్చా పచ్చా తీర్చుకొని తయారవడం, నేనేమో మీకోసం యెదురుజూస్తూ పన్నెండు ఘంటలదాకా పడి వుండటమూనా? ఎప్పుడనగా కబురంపించాను ఎప్పుడు వచ్చారు?

కోటయ్య : లేదుబాబూ, ఎంకన్నొచ్చి చెప్పగానే కలిగిన మారాజుకాడికెల్లి కడుపూ కాళ్లూ పట్టుకొని డబ్బు దెచ్చేవర కీయాళయిందండీ.

వీరయ్య : ఎంకన్నొచ్చి పిలవగానే దున్నేదున్నె అరక ఆదరాబాదరా వూడదీసి, తమ దర్శనానికి రానే వచ్చాగా బాబూ.

వెంకన్న : వచ్చారులేవయ్యా మాతోందరగా, తిరిగీ తిరిగి కాళ్లడిపోతేను. కట్టండయ్యా సిత్తు. కట్టండి. ఎండెక్కుతావుంది పోవాలి.

నాగేం : కడ్తారటరా కడతారూ? ఏ రైతుసంఘానికో ఏ సభకో చందాలివ్వడానికయితే డబ్బు కనపడుతుందిగాని శిత్తు కట్టాలిసొచ్చేసరికి పంటలు పోయాయనీ, అప్పు దొరకలేదనీ, యెక్కడలేని యిబ్బందులు వచ్చిపడతాయి.

వీర : సభలూ చట్టుబండలూనూ, 'తనుదూర కంతలేదు మెడకొక డోల'ని పొలమంతా బెట్టదీసి గిద్దెడుగింజలు పండక యీ యేడు శిత్తుకట్టేది యెట్టారా అని మేమే డుత్తూవుంటే.

నాగేం : ఊఁ... మొదలా! మొండిచెయ్యి చూపటానికి.

వీర : మొండిచెయ్యేముంది బాబూ. అసలుండిసత్తేనా? చెరువు మొరకేసిపోయె, అందులో దొరగారు లోతట్టున పొగాకేశారాయె.

నాగేం : ఏస్తే నీకొంపేం మునిగిందయ్యా ?

వీర : నా ఒక్కడికొంపే మునిగితే పరవాలేకపోను.

నాగేం : ఊరందరి కొంపలూ మునిగాయంటావు. ఏం?

కోట : కాదుమరీ. పొగాకెయ్యటం మొలానవచ్చిన కాసినీళ్లు చెరువే పీల్చేసింది. ఆశ్లేస ఆఖరుపాదంలో ఏవో నాలుగు చినుకులడితే కింద తూము పారుదలతో కాస్తా కూస్తా యేమయినా పండితే యెట్టేటువారి పొలం, అచ్చయ్యగారి పొలమేగా.

వీర : మిగతావాళ్ళకి యిత్తనమన్నా మల్లలా.

నాగేం : ఏమిటోయి సోది ? నీ మిడుకుడేదో నీవు మిడక్కు.

వీర : ఈపాడు పొట్టకోసం ఏదైనా మిడకాలి. కాస్త దరబలికితే అయిన పదితాళ్ల పొగాకూ అమ్మేసి సిత్తు

కత్తుకుంటాను బాబూ. (దీనంగా) తరవాత మాగతి ఏమన్నా కాని.

నాగేం : నాకు తెలుసులేవయ్యా యీ భాగోతమంతా.

కోట : ఏ భాగోతమయినా నాలుగురోజులు ఎనకా ముందే కాని తప్పేదేముంది? ఇదివరకల్లా వచ్చి గొంతు మీద కూచుంటే పెండ్లాం మెళ్లో పుస్తెలుకూడా తెగ నమ్మి కడతల్లా.

నాగేం : ఏమిటయ్యా కడుతూవుంది? గత ఫసలీది యింత వరకూ గతిలేదు. కట్టాడట కట్టడం! కబుర్లు.

కోట : (తెల్లబోయి) ఇదేం అన్నాయమండో, నిరుడు కట్టకపోవడమేమిటి? నేనూ మా పుల్లయ్యా మీ యింటికే తెచ్చి కట్టాంగా. గుర్తు తెచ్చుకోండి. మేమొచ్చినప్పుడు మీ పెద్దబ్బాయిగారు పరీచ్చకు డబ్బుగట్టాలని అడుగుతూంటే కడదాంలేరా అంటల్లా మీరు ?

నాగేం : (వికటంగా) భేష్, మాబాగా అల్లావోయ్. అబద్ధ మాడినా అతుక్కుపోయింది మరి. తెలివితేటలు.

(అచ్చయ్యగారి ప్రవేశం)

వెంకన్న : దణ్ణాలండీ అచ్చియ్యగారూ!

కోట : అబద్ధం మాయింటావంటా లేదండీ. పెమాణ పూర్తిగా కట్టానండి.

అచ్చయ్య : ఏమిటండో తానేదారుగారూ, ప్రమాణాలదాకా వచ్చింది వ్యవహారం.

నాగేం : ఎందుకురాదూ ? ఏదో పిల్లల గలవాడు నెమ్మదిగా కడతాడులే అని దయదల్చి వూరుకుంటే ఏకంగా కట్టేశానని బుకాయిస్తున్నాడు.

అచ్చ : ఏమిటిరా కోటయ్యా యీ గొడవ ?

కోట : నిరుడీరోజుల్లో శిస్తుకట్టాలని నీ దగ్గర అప్పు తీసుకోలేదంటే ?

అచ్చ : నిజమే తీసుకున్నావు.

కోట : ఆ పూటనే నేనూ, పుల్లయ్యమామా యెళ్లి సిస్తు కట్టేశామే. నామాట అబద్ధమయితే పుల్లయ్యమామను కూడా అడుగు (వీరయ్యవైపు చూచి) పరుగెత్తికెళ్లి పుల్లయ్య మామను తీసుకురారా. (వీరయ్య పోతూవుంటాడు) ఇక్కడుండట్టు రావాలి. (వీరయ్య తల వూపుకుంటూ వెళ్లిపోతాడు)

నాగేం : ఏమండీ అచ్చయ్యగారూ, శిస్తుకడితే చిఠ్ఠాలో జమ వుండదండీ ?

అచ్చ : ఉండాలసిందే. (కోటయ్యతో) రసీదు లేదంటూరా కోటయ్యా ?

కోట : రసీదు లాకనాడు తిన్నగా యిచ్చారాయేమే ? దస్తు తీసుకొని రసీదు రేపిత్తాలే పొమ్మన్నాడు. తరవాత

యీాయన యింటిచుట్టూ తిరిగి తిరిగి విసుగెత్తింది. చీటీముక్క మాత్రం చేతికి రాలా.

అచ్చు : నాదగ్గర డబ్బు తీసుకున్నదిమాత్రం నిజం. తరవాత పాపం పుణ్యాం పరమాత్ముడుకి తెలియాలి.

నాగేం : డబ్బు తీసుకుంటే దేనికి ఖర్చుపెట్టుకున్నాడో ?

అచ్చు : ఆ శిస్తుకట్టడానికని తీసుకున్నాడండీ.

నాగేం : శిస్తు కట్టడానికని తీసుకొని యింట్లో అవసరానికి వాడుకోగూడదూ ?

(పుల్లయ్య వీరయ్యల ప్రవేశం)

పుల్ల : ఇంట్లో అవసరానికి వాడుకోబట్టే చిట్టాలో జమ లేకుండా పోయింది.

నాగేం : చాల్లేవయ్యా చెప్పొచ్చావు పెద్ద న్యాయకర్తవు.

కోట : నేను కట్టానండి బాబూ. నా బిడ్డలతోడు. ఏ పెమాణం జెయ్యమన్నా చేత్తాను.

నాగేం : ఎగ్గూ సిగ్గూ విడిస్తే ఏదయినా చెయ్యొచ్చు. ప్రమాణాలతో వదలిపెట్టడానికి యిది యెస్టేటు సొమ్ము. నా వొళ్లో పడేదేంకాదు.

పుల్ల : ఎవళ్లవొళ్లో పడేది వాళ్ళవొళ్లోనే పడింది. కూతురు పెండ్లొచ్చిందంటే ఊళ్లో వసూలు చేసిచ్చిన వెయ్యి రూపాయిలుగాక కూరగాయల దగ్గర నుంచీ, తెచ్చి

కొంపనిండేశాం. దొరగారితో చెప్పి చెరువు మరమ్మతు చేయిస్తాను. నామాట యేమిటంటే ఆసామి వారీ పోగుచేసి అయిదు వందలిచ్చాం. పట్టా మామూళ్లు సరేగదా; పుడితే పురుళ్లకి చస్తే చావులకి జలగ బీల్చినట్లు పీల్చావు మా నెత్తురంతా.

నాగేం : ఓహో! ధర్మాత్ముడివి బయల్దేరావు. చాల్లే అంతటితో కట్టిపెట్టు. (కోటయ్యతో) ఇంతకూ నీవుకట్టేదా లేందా ?

పుల్ల : గోచికి మించిన దరిద్రమేమిటి? మూడూళ్లు ముట్టైత్తయినా కడతాం గాని, ఆ సరస్వతిని నెత్తిన బెట్టుకొని దస్తు తీసుకోలేదని ప్రమాణం చెయ్యి.

నాగేం : (కోపంతో) నోరుముయ్. తల ఏమన్నా తిరుగుతూవుందా యేం? నోటికొచ్చినట్లల్లా వాగుతున్నావు జాగ్రత్త.

పుల్ల : కాకపోతే యేంజేస్తావయ్యా, తలగొట్టి మొలేస్తావా?

కోట : చేసుకునేదేమిటో చేసుకో. కట్టిన సొమ్ము మళ్ళా కట్టమంటే యెక్కడ తెత్తాం!

అచ్చు : అఘోరించారులే ఆగండోయ్ పెద్దమ్మనులారా? మొదట తెలివితక్కువగా చేసుకునేదీ, తర్వాత యేడ్చేదీని.

పుల్ల : ఇట్టా పొదుగు గోసుకొని పాలుదాగుతాడని యెవరికి తెలుసేం.

అచ్చు : ఆ పెద్దమనిషిమాత్రం అంత అన్యాయానికి ఒడిగడ తాడటరా ?

కోట : అంతేలెండీ. మీరట్టా అనక యింకా యెట్టంటారు ? వెర్రాడి పెండ్లాం వాడకల్లా వదినని అందరికీ లోకువ మేమేగా.

అచ్చు : మీరూ మీరూ కలిసి గంగలో దూకండి. దారే పొయ్యే పెద్దమ్మోరా నెత్తికెక్కమని నా కెందుకీ పీడ. కరవమంటే కప్పకు కోపం. విడవమంటే పాముకు కోపం.

నాగేం : పోదాం పదరా వెంకన్నా, మనకెప్పుడన్నా మర్యాదగా కట్టే మామూలుంటేగా ? జరగాలసిన కర్మకాండ కాస్త జరిగితేనేకాని......

(నారాయణరావు, కాసింలు ప్రవేశిస్తారు)

నారా : ఏమిటండీ నాగేంద్రంగారు, కోప్పడుతున్నారు ?

నాగేం : ముడ్డిగిల్లి జోల బాడటానికి వచ్చావ్, నిన్ను జూచి నేర్చుకోలేకపోతామటలే. (చరచరా వెళ్లిపోవును)

కాసిం : మీకే హంతా తెల్విహుంది.

నారా : ఏమిటి పుల్లయ్య మామా. మళ్లీ యేం పేచీ పెట్టాడేం ?

పుల్ల : నిరుడు నేనూ, కోటయ్యా ఒక్కసారే శిస్తు కట్టాం. ఇప్పుడు నేకట్టాలిసింది ఎంతండీ అని కోటయ్య అడిగితే నిరుటి దెవరు కడతారోయ్ అన్నాడు.

కోట : మంచితనంగా జెప్పాం. వింటేనా? దానిమీద మాటామాటా వచ్చింది.

వీర : నోటికొచ్చిందల్లా వాగాడు గుడ్లురుముతూ.

పుల్ల : వెనకతాళం వెయ్యడానికి అచ్చయ్యగారు తయార్.

కాసిం : అచ్ఛా. హోయన్ కూడా వుండాడ్. చల్లన్ వేళా తల్సావ్ మారాజ్కు.

నారా : ఇదే మనలోవున్న తెలివితక్కువ. వాళ్లను గుడ్డిగా నమ్ముతాం. వాళ్లేమో మన నెత్తినెక్కి తొక్కుతారు. రసీదు తీసుకోకుండా మాటలునమ్మి శిస్తు గట్టిన ఫలితం యిది.

పుల్ల : అయిపోయిన దానికి యిప్పుడు చేసేదేమిటి? ముందు జరగాల్సిందేమిటో చూడాలిగాని.

నారా : అవును పుల్లయ్యమామా. మనమీకష్టాల్నుంచి గట్టెక్కాలంటే వీళ్ల దురాగతాల్ని యెదుర్కోవాలి. దీనికి సంఘబలం ఎంతో అవసరం. ప్రతి రైతూ సంఘంలో చేరాలి. ఆవేళగాని కొండమీదికోతి దిగిరాదు. ఈలాటి పిచ్చిపిచ్చి వేషాలేమీ సాగవు. రైతు సంఘం జెండానీడనే మనకు మోక్షం, స్వాతంత్ర్యమూ వుంది.

కాసిం : ఠీక్ హై, హిట్టా దారీడొంకా లేకుండా హుండబట్టే వాళ్ళకు కండ్లు నెత్తికొచ్చాయి.

వీర : సంగం బెట్టుకుంటే మళ్లా యేం మిడిమేళం తెచ్చి పెడతాడో.

కాసిం : హేమ్టిా తెచ్చిపెడతాడ్ హాడీ తల్కాయ. పేరూ జూడబోతే మొన్గాడీ పేరూ బెట్టుకున్నావ్. హీరయ్యా హీరయ్యా, పిర్కి చూడబోతే జెర్రిబోత్తూ హున్నంత హుందేమిటయ్యా నీకు ?

నారా : ఇంతకంటే యింకా యేంజేస్తాడు వీరయ్యన్నా. మూడు :సంవత్సరాలునుంచీ చెరువు మరమ్మతు చేయించమని అర్జీలూ మహజర్లూ ఇచ్చి యెంతో మొత్తుకున్నాం. ఇప్పటికి అతీగతీ లేదు. కాడీ మేడి కయినా కర్రకొట్టి తెచ్చుకోడానికి వీలులేదుగదా! పంటలు పోయిన్నై; శిస్తురిమిషన్ ఇప్పించమని గోల పెట్టాం. వదిలిపెట్టాడా ? కొంపా గోడీ అమ్మించి మరీ పుచ్చుకున్నాడు. పై పెచ్చు కట్టిన కిస్తీకి రశీదు యివ్వకుండా మళ్లీ కట్టమని పేచీ పెడుతున్నాడా ? ఇంతకంటె తెచ్చిపెట్టె మిడిమేళం యింకా యేముంటుంది?

కోట : నిజమేరా. యింతకంటె యీాడేడ్చేదేమిటి ? మనమందరం సంఘంలో చేరాలిసిందేరా.

కాసిం :<br>
పుల్లి :<br>
వీర :
} ఆఁ. తప్పకుండా చేరాలిసిందేరా.

నారా : బోలో రైతు సంఘాలకీ జై.

(అందరూ అంటారు)

**మోహన్ రాగం — ఆదితాళం**

భారత వీరకుమారా। రారా కర్షక వీరా ॥భారత॥
కలసిమెలసి నీహక్కుల కొరకై । కదనము సేయుమురా ॥భార॥
ఎదురులేని నీశక్తిని చాటగ । నెగురవేయరా జెండా ॥ఎగుర॥
జయగీతిన్ పాడుమురా । జై జై జై అనరా ॥భార॥

# 2

[గచ్చునేలమీద తివాచీపరచి వుంటుంది. రెండుబల్లలు, మూడు కుర్చీలు, ఒక కుషన్ చెయిర్, ముందు ఒకటేబులూ, టేబులుమీద అగరువత్తులు మొదలయిన సుగంధద్రవ్యాలూ, బ్రాందీసీసా, మూడు గ్లాసులూ వుంటాయి. గోపికావస్త్రాపహరణం, రాధాకృష్ణుల రాస క్రీడలూ, అర్ధనగ్న యూరోపియన్ స్త్రీల చిత్రాలూ, జార్జి చక్రవర్తి చిత్రం, మొదలైనవి వుంటాయి. జమీందారు చక్రధరరావు కాఫీతాగి చెయ్యి తుడుచుకుంటూ ప్రవేశం]

చక్ర : ఒకేయ్,

వెంకన్న : సిత్తం, సిత్తం.

చక్ర : మనడేగమీద రావుగారి కాకిని పందెంవేస్తా మంటున్నారు. జోడేనట్రా.

వెంక : (గ్లాసులో బ్రాందీబోసి అందించబోతాడు)

చక్ర : ఛీ ఛీ. వెధవ, నేనన్నదేమిటి? నీవు చేసేదేమిటి?

వెంక : (గ్లాసు బల్లమీదబెట్టి చేతులు గట్టుకొని) సిత్తం. సిత్తం.

చక్ర : చిత్తంగాదు నీబొంద. అదిగాదురా మనడేగ మిగులా రావుగారి కాకి మిగులా?

వెంక : (నవ్వుతూ) రావుగారి కాకా! ఎదవకాకి, మనడేగ బ్రెమిీదనుంచోని కూతేస్తే రావుగారి కాకిబోయి ఊతకింద దూరాలిసిందే. డేగడేగే. కాకికాకే. (చక్రధరరావు వికటంగా నవ్వుతూ గ్లాసు పైకెత్తి ఒక గుటకేసి మరల సిగరెట్టు పీలుస్తూ వుంటాడు. రామ్, మోహనుల ప్రవేశం)

రామ్ : మనడేగమీద పందెంవేసే మొనగాడున్నాడుగా? మొన్న పంగినగూడెం పందాలలో అంతలావు నెమలిని యీక మెరుపుగాకుండా తొలిసీళ్లలోనే ఖూనీ చేసింది. అదిరిపొయ్యారు జనమంతా. (మోహన్ వంకజూచి) ఏరా మోహన్!

మోహన్ : కాలికి అందేసి నూటికి సెలగంటే కోటిమంది జనంలో కుయికుయ్యమన్నాడు లేడు.

రామ్ : పోరా వెంకన్నా, డేగను సర్దాచెయ్యి.

చక్ర : అరే రామ్, కాసేపు ప్లేయింగ్ కార్డ్సు వేయవోయ్ సర్దాగా.

రామ్ : (చీట్లపేక దీసి కలుపుతూ) ఏం వేద్దామంటారు?

మోహన్ : బ్రిడ్జి వేయరా బ్రిడ్జి. బాగుంటుంది.

చక్ర : ఛట్, నాన్సెన్స్. వెధవబ్రిడ్జి. పలాస్ వేయవోయ్.

రామ్ : (ముక్కలుతగ్గిస్తూ) ఢంకాపలాస్. వారెవ్వా (ముక్కలు కలిపివేస్తాడు ముగ్గురూ గూటుతారు)

మోహన్ : (ఎత్తి చూచుకొని) నీ చెయ్యితగలెయ్య. వేశావు ముక్కలు. ఆసు గొప్పన్నా లేదు. (పారే స్తాడు)

రామ్ : దరిద్రుడా నన్నంటావేమిరా, కోతగోసి యేడ్చింది నీవేగా?

చక్ర : ఏయ్ గొడవ, ఆట జూడండిరా.

రామ్ : (ముక్కలుజూచుకొని) వరసేశా. (డబ్బులు బరిలో వేస్తాడు)

చక్ర : (ముక్కలు చూచుకొని) రెండు రూపాయలు. (గిరిలో వేస్తాడు)

రాం : (ఈలవేస్తూ) (జమీందారు వంకజూస్తూ) (రెండు రూపాయలు బరెలో వేసి) గోఆన్. కమాన్.

చక్ర : (నవ్వుతూ) నీదేమిటిరా?

రామ్ : (ముసి ముసి నవ్వులతో) నాది రాణీలజంట.

చక్ర : ఓ. అలాగా, నావి రాజులు. (ముక్కలుతిప్పి బల్ల మీదవేసి చూపెడతాడు. డబ్బు తీసుకుంటాడు)

మోహన్ : రాణీమీద రాజు పైచెయ్యే. కాని ఈ రాణీ మీదగాదు మీ చెయ్యిపడాలసింది; (రాంవైపు చూచి కన్నుగీడుతూ) ఏమిరా రాం?

రామ్ : ఓ. (వికటంగా నవ్వుతూ) అదా. అది బాబుగారి పక్కన కూర్చుంటే యేం మజా. అరరే చూడటానికి యీ కండ్లేం చాల్తాయిరా.

మోహన్ : ఎలావుంటుంది దేవేంద్రుడి పక్కన రంభ.

రామ్ : రంభ? డామిట్, పాత చింతకాయపచ్చడి. అలాంటి పది రంభలయినా దాని కాలిగోటి ఖరీదు చెయ్యారు. స్వీట్ నైటింగేల్. ఇహిహిహి. పేరుబెడితే నోరు ఊరేలా ఉండాలి. రంభట రంభ.

పంచవన్నెల చిలుక – పంచదార లడ్డు
చందురుణ్ణి మించు – చక్కనీ చుక్కరా ॥పంచ॥
వారగంటా జూచి – వారెవా కనుగొంటే
కను చెదరిపోవాలి – గుండె లదరాలి– ॥పంచ॥
రంగుచీరా గట్టి – చెంగునా దూకి
బ్రాందిసీసా నోటి కందించెటప్డు
చూడాల ఆ సోకు – ఆ టీకు టాకు ॥పంచ॥

చక్ర : అరే, ఎక్కడుందో యేమో చెప్పకుండా పిచ్చిగంతు లేస్తావేరా ఫూల్.

రామ్ : ఉంది. ఎక్కడో వుంది.

చక్ర : అరే.

రామ్ : అరేలేదు గిరేలేదు. ఉందంటే వుంది. అంతే.

మోహన్ : (వెకిలిగా నవ్వుతూ) ఇంకెక్కడ మదరాసులోనే. బంగారు పిచ్చుక.

చక్ర : అయితే చూస్తారేమి? బయలుదేరండి. ఈపూటే. ఊఁ. ఎటెవన్స్.

రామ్ : రేపెల్లాగూ ప్రయాణముందగా. గిండీ రేసెస్‌కి.

మోహన్ : అలా అయితే రేపే వెళుదాం. ఇంతలో మునిగి పోయిందేమిటి ?

(నాగేంద్రం ప్రవేశించి జమీందారుకు నమస్కారంజేసి నిలబడతాడు)

చక్ర : ఏమాత్రం వసూలయింది.

(నాగేంద్రం తలవంచుకుని ఆలోచిస్తూన్నట్లు నటిస్తాడు)

రామ్ : ఏమిటండీ నేలచూపులు చూస్తారు ?

చక్ర : అసలు జ్ఞాపకముందా రేపు మద్రాసు ప్రయాణమున్న దన్న సంగతి ?

నాగేం : ఏం జ్ఞాపకముంటే ఏం లాభంలెండి. ఏం వసూలు చెయ్యను నాపిండాకూడు.

మోహన్ : ఏమిటండీ యీ గొడవ.

చక్ర : మిడికేదేమిటో సరిగ్గా మిడుకు.

నాగేం : గిద్దెడు గింజలు పండందే కట్టుకట్టు అంటే యెక్కడ తెచ్చి కట్టమంటావయ్యా శిస్తు అని దబాయించాడు.

చక్ర : ఎవడా పొగరుమోతు.

నాగేం : ఎవడున్నాడు. ఆ పెంకెముండాకొడుకు పుల్లయ్య.

రామ్ : మీరేమో యేమి మాట్లాడితే యే ప్రమాదమో అని చడీచప్పుడు లేకుండా చంకన దస్త్రం పెట్టుకొని చల్లగా జారారన్నమాట.

నాగేం : (తీవ్రంగా) ఈ నాగేంద్రం వాజమ్మగాడు. "నీవొక లెక్కా, నీతలదన్నినవాడిదగ్గర వసూలుజేశాం. మీ తాత యెవడు కడతాడు. దొరగారు కట్టాలిసిన పేష్ కష్, పిచ్చిపిచ్చి వేషాలుమాని వెంటనే కట్టేయండ" న్నాను.

మోహన్ : ఆమాత్రం ఘాటుగా తగలకపోతే వాళ్లు మాటింటారూ ?

చక్ర : ఊఁ. అంటే ?

నాగేం : ఇక వాగాడండీ యేంచెప్పను !

చక్ర : ఇంకా ఏం వాగాడేం ?

నాగేం : వాళ్లేమో పస్తులుండి శిస్తులు కడుతున్నారట. చెరువు మరమ్మతన్నా చేయించకుండా ఆ డబ్బుతో తాగి తందనాలాడతారట. వేశ్యల యిండ్లచుట్టూ పిచ్చికుక్కల్లాగ తిరుగుతారట. గుర్రపు పందాలట! కోడిపందాలట !! వెనకా ముందులేకుండా వాగేశాడు వాడిష్టం వచ్చినట్లు.

రామ్ : అయిందీ.

చక్ర : (లేచి చేతిలో గ్లాసు బల్లమీదకొట్టి) వీడితిత్తే వలిపించకపోతే నాపేరు చక్రధరావేకాదు. చూడు నా తడాఖా.

నాగేం : దొరగారి సెలవయితే వీడిబ్రతుకెంతగాని వీడి గురువున్నాడింకొకడు. మూలవిరాట్టు.

రామ్ : ఆ మొనగాడెవడండో.

నాగేం : ఉన్నాడులే ఒక వెధవ. నిరుడుజచ్చిన రామయ్య కొడుకు నారాయణరావు.

రామ్ :
మోహన్ : } ఆఁ సన్యాసా? (యిద్దరూ వెకిలిగా నవ్వుతారు.)

చక్ర : ఆఁ ఏమిటి? రావా? రావు.

నాగేం : మిడికాడుగా బస్తీకెళ్లి నాలుగింగ్లీషు ముక్కలు. ఇవ్వాళ రావయ్యాడు. రేపు రాజౌతాడు. ప్లీడరు సవాళ్ళేస్తూ 'లా' అంతా తనకే తెలిసినట్లు మాట్లాడతాడు. 'గోవులేని ఊళ్లో గొడ్డుగేదె శివాలక్ష్మి', అని యెంతపొగరు?

రామ్ : ఆ, నిన్నటిదాకా వారాలు జేసుకొని చదివాడు వెధవ. అంత మొనగాడయ్యాడూ?

చక్ర : అవుతాడవుతాడు, ఎముక లిరగదన్నితే సరి.

నాగేం : అదెంతపని, వాళ్ల సంగతి నీకు తెలుసుగా, మోహన్ (రూపాయి మోగించినట్టుగా చూపెడ తాడు.)

మోహన్ : దొరగారికి మాత్రం తెలియదూ వాళ్ల సంగతి.

రామ్ : వాడా పిల్లిభీముడు. వాడయితే సున్నంలోకి యెముక దొరకనివ్వడు.

చక్ర : భేష్ బలే యెత్తువేశావోయ్. కానియ్యి. వదలి పోవాలి ఆ జలుబునీళ్లుకాసిని. (జేబులోనుంచి వంద రూపాయలనోటు తీసియిచ్చి) చెయ్యి. ఇక నీపని చేసెయ్యి. (రామ్, మోహనులవైపుజూచి) పదండిరా పోదాం. (రామ్, మోహనులు ముందు, వెనుక జమీందారు వెళ్లుతూ వుంటారు. నాలుగడుగులేసి వెనక్కితిరిగి) నాగేంద్రం జాగ్రత్త. ఒక్క యెముక గూడా మిగులగూడదు. పూర్ణంగావాలి (వెళ్లి పోతారు)

నాగేం : (వందరూపాయలనోటు చూచుకుంటూ ముసిముసి నవ్వులు నవ్వుతూ రెండోవైపుగా వెళ్లిపోతాడు)

# 3

(స్త్రీ టు సీను)

**పుల్లయ్య తల వెనుకభాగాన రక్తం కారుతూ ఉంటుంది నారాయణరావు పట్టుకొని నడిపించుకు వస్తూ వుంటాడు)**

నారా : పర్వాలేదు. నెమ్మదిగా నడువుమామా, దుర్మార్గులెంతపని జేశారు.

పుల్ల : (మూల్గుతూ) అబ్బా! నారాయణా! కండ్లు తిరుగుతున్నాయి. నడువలేనురా బాబూ.

నారా : కాసేపు కండ్లుమూసుకు కూర్చోమామా. (నెమ్మదిగా కూర్చోబెట్టి పుల్లయ్య తలను తనతొడమీద ఉంచుకొని నిమురుతూ) ఇంతలో కాసిం కూడా వస్తాడు. కలసిపోదాం.

పుల్ల : ఇంటికాడ గాయం పెద్దగా తగిలిందని చెప్పకేం నాయనా? మీ అత్తయ్య గల్లంతుపడుతుంది.

నారా : అలాగే. మాట్లాడకు, ముందు మాయింటికిపోదాం. (పక్కకుచూచి) అదుగో, కాసింకూడా వస్తున్నాడు.

కాసిం : (బొంతపువ్వు తీసుకొని వడిగా ప్రవేశించి) పిరికిపందలాగా దాడ్ తీశారు ఎధ్వాల్, లేకపోతే ఖూనీచేశే

వాణ్ణి నాకొడ్కులిక్కి. (పుల్లయ్య కండ్లు తెరచి చూస్తాడు) హిద్గో బొంతాపువ్వు. జర్రా కట్టు కట్టు.

నారా : (గాయంలో బొంతపువ్వు కట్టుగడుతూ) వాళ్లె వళ్లో గుర్తుబట్టావా కాసిం.

కాసిం : హింకా యెవడూ సచ్చాడ్. వాడే పిల్లీ భీముడి ముఠా. (పుల్లయ్యవంక జూస్తూ) హెట్టా వుంది. భాయి?

పుల్ల : మరేం పరవాలేదు. నాకనుమానంగానే వుంది. ఏదో మిడిమేళం జరుగుతుందని. మంచీచెడ్డా లేదు. కసాయి ముండాకొడుకులు.

నారా : వీళ్ళకు వినాశకాలం దాపురించింది.

కాసిం : కాలం గీలం జాన్తానై. దెబ్బకి దెబ్బ తీయాలిసిందే.

పుల్ల : తొందరెందుకు కాసిం.

కాసిం : తొందరనైతో క్యాభాయి?

నారా : ఇంటికివెళ్లి ఆలోచిద్దాం పదండి.

(నారాయణరావు కాసింలు పుల్లయ్యను పట్టుకు తీసుకెళ్తారు. తెర లేస్తుంది; శాంతమ్మ పాడుతూ ఏకులు వడుకుతూ వుంటుంది. గదిలో నాయకుల ఫొటోలు తగిలించి వుంటాయి.)

శాం : నూలు తీదాము రారే.
అలసాలీమూకన్నా బహుసన్నానైనా నూలు
నూలూ తీదాము రారే ||నూలూ||

రాదూ రాదని నీవు వాదాము సేయకే
రానీదేమున్నాదే రమణీరో నేర్చిన ॥నూలూ॥

(విమల ప్రవేశించి నవ్వుతూ పాటవింటూ వుంటుంది)

విమల : అమ్మమ్మా, పాటలుకూడా పాడుతున్నావే?

శాంత : (చిరునవ్వుతో) రా అమ్మా, కూచో, నాపాటల కేమొచ్చిందిలే, పిచ్చిపాటలు. ఏదీ నీవొక్కపాట పాడమ్మా.

విమల : గొంతు బాగుండలేదమ్మమ్మా.

శాంత : పరవాలేదులే. ఒక్కపాట పాడమ్మా.

తిలకామోద్ - దాద్రా

విమల : స్వాతంత్ర్యము స్వేచ్ఛయు శాంతీ
ఈ జగతి లేదా స్త్రీలకు?
లేదా సుఖము జీవితంబున ఈ జీవితంబున
ఈ జగతి లేదా స్త్రీలకు?
సంఘ దురాచారాల్ క్రుంగదీసె మనలన్
లేదా యిక తరించు మార్గమూ ॥ఈజగతి॥
ఝాన్సీ లక్ష్మి రుద్రమజాతిని జన్మించీ
భీతియేల హక్కులడుగగా
నీ హక్కులడుగగా ॥ఈజగతి॥

అమ్మమ్మా కాసేపు నన్ను వడకనివ్వవూ.

శాంత : నీ కెందుకమ్మా, హాయిగా కాలుమీద కాలేసు కూర్చోక. అచ్చియ్యగారు కావాలిసినంత సంపాయించారు. రేపు నువ్వూ నీ మొగుడూ మహారాజుల్లాగే కులుకుతూ కూచొని తినొచ్చు,

విమల : చాలులే అమ్మమ్మా, నీవు మరీని.

శాంత : పోనీయి. అననులే అమ్మా. నాయన యింటికాడున్నాడా అమ్మా ?

విమల : లేరు. జమీందారు కబురంపించాడని వెళ్లారు.

శాంత : అమ్మాయీ, యిమలా, మనాళ్లు ఇంకా రాలేదేం? సందచీకటి కూడాను.

విమల : ఏమో రావాలిసిందే యీపాటికి. ఒకవేళ రాత్రికి అక్కడే తిష్టవేస్తాడేమో. అయినా యిప్పుడేమంత ప్రొద్దుపోయిందిలే అమ్మమ్మా. ఎనిమిదవుతుంది.

శాంత : ఉండరమ్మా ఉండరు. ఎంత పొద్దోయినా తప్పకుండా వత్తారు. పుల్లయ్యా కాసింలు సావాసం కూడా వుండారుగా. తప్పకుండా వత్తారు.

విమల : నేనిక యింటికి వెళ్లతా నమ్మమ్మా. నాన్నగారు కూడా వచ్చేవేళయింది.

శాంత : అట్టాగే వెళ్ళిరామ్మా.

(విమల వెళ్ళబోతుంది. అంతలో నారాయణరావు, పుల్లయ్య, కాసింలు కనపడతారు.)

విమల : అమ్మమ్మా, అమ్మమ్మా. అదుగో మాటలో మాటేసుకొస్తున్నారు.

శాంత : నూరేండ్లాయుస్సు.

(నారాయణరావు, పుల్లయ్యా, కాసింల ప్రవేశం. పుల్లయ్య తల మీద కట్టు రక్తపు మరకలుచూచి శాంతమ్మా,విమలలు కంగారుపడతారు.)

శాంత : ఏం పుల్లయ్యబ్బాయీ, తలకాకట్టేమిటి? ఆ రక్తపు మరక లేమిటి? ఏం అనాశం జరిగిందిరా నాయనా?

విమల : (మంచం వాలుస్తూ) ముందు కూర్చోనివ్వండి. (పుల్లయ్య కూర్చుంటాడు) దాహం కావాలా బాబాయి.

(జవాబు కెదురుచూడకుండానే మంచినీళ్ళు తెచ్చియిస్తుంది)

నారా : మీటింగు అయ్యేసరికి కనుచీకటి పడుతూవుంది. ప్రొద్దుబోతుందని తొందరగా బయలుదేరామమ్మా.

కాసిం : సిరిపురం దాటీ హాక్కీ మైలు వచ్చామో లేదో. బడా లుచ్చా మన జమీందా రుండాడూ లేదూ హోడ్కి మనుసుల్ గడ్డి తిన్నార్.

శాంత : ఓరాళ్ల చేతులిరగ.

పుల్ల : ఎదుళ్ళవాగుకాడి కొచ్చాం. వాగులో అట్టాదిగామో లేదో ఒక రాయొచ్చి నా కిక్కడ తగిలింది.

నారా : పుల్లయ్య మామను నేను పట్టుకున్నాను. కాసిం రాయివచ్చిన వైపు కురికాడు.

కాసిం : హేమిట్టా ఫాయిదా ధౌడ్ తీసి. దొర్కలా గాడ్డికొడుకుల్. హెప్పటికయినా పిల్లీభీముడ్కి నాదీ తడాఖా చూపిస్తేనే ముసల్మాన్ బిడ్డా బోలో అమ్మా!

శాంత : అళ్ల కేం పొయ్యేకాలమొచ్చిందిరా నాయనా నిన్ను కొడ్డానికి.

విమల : ఎంత దుర్మార్గం ?

నారా : ఇందులో పెద్ద ఆశ్చర్యంలేదు. ఇలాంటి పనులు చేయడం యీ జమీందారులకు పరిపాటే విమలా.

విమల : పుల్లయ్య బాబాయిలాంటి పెద్దమనిషిని యింత నీచంగా కొట్టించాడంటే వేరే రాక్షసు లెక్కడో వున్నారనుకోవడం పొరపాటు.

నారా : రాక్షసుడు తన ఆకలి తీర్చుకోడానికి ఒక్కసారిగా మనిషిని చంపి భక్షిస్తాడంటారు; కాని, బ్రతికున్న వాళ్ల రక్తమాంసాలు యీవిధంగా రోజురోజూ పీలుస్తూ హింసించడు.

శాంత : ఒకళ్ళను ఒకమాట అనిగానీ, ఒకళ్లతో ఒకమాట పడిగానీ ఎరగడు. దారేపోయి దారే వచ్చేవాణ్ని కొట్టించడానికి ఆ పాపిష్టి ముండాకొడుకు చేతులెట్టా ఆడినయ్యో.

విమల : కొట్టించాడని విచారపడితే యేం లాభమమ్మమ్మా. తగిన ప్రాయశ్చిత్తం చేయాలిగాని.

కాసిం : నిజం చెప్పావు నూరేండ్లు బతుకు తల్లీ.

నారా : అవును. ఈ దుర్మార్గాన్ని అరికట్టాలంటే అందరూ కార్యరంగంలో కురికి పనిచెయ్యాలి. అప్పుడుగాని, యీ విషవృక్షం కుంగ టేళ్లతో పెల్లగిల్లదు.

విమల : అవును. తప్పకుండా జేయాలి (శాంతమ్మతో) వెళ్ళతానమ్మమ్మా.
(పుల్లయ్యవైపు తిరిగి) వెళతా బాబాయి, ప్రొద్దు పోయింది.

పుల్లి : సరే వెళ్ళమ్మా.

విమల : (అక్కడున్న పుస్తక మొకటి చేతితో పుచ్చుకొని నారాయణరావుతో) ఈ పుస్తకం పట్టుకెళ్లుతున్నాను. చదివిస్తాను.

నారా : అలాగే.

(విమల వెళ్ళిపోతుంది)

నారా : కాసింబాయీ! నీవుకూడా వెళ్ళు. ఇప్పటికే పొద్దు పోయింది. పుల్లయ్య మామ ఈరాత్రి కిక్కడే వుంటాడులే.

కాసిం : అచ్ఛా, అచ్ఛా (వెళుతూవుంటాడు)

నారా : కాసింబాయీ ప్రొద్దున్నే కనబడతావా?

కాసిం : కనపడ్తావా? తెల్లవారేసరికి వూడిపడను.

నారా : సరేవెళ్లు (కాసిం వెళ్లిపోవును)

శాంత : లెండినాయనా అన్నం తిందురుగాని.

పుల్ల : ఆకలిగాలేదు, అక్కయ్యా.

శాంత : అయ్యో. కొద్దిగా యెంగిలిపడు నాయనా. ఏడి జేత్తుంది. సందేయిత్తన్నావా?

పుల్ల : సందేహమేమి టక్కయ్యా మనలో మనకి - కాస్తి మందం జేసింది.

నారా : అయితే కాసిని పాలుదాగు మామా. తీసుకురా అమ్మా.

శాంత : అట్టాగే. (నాలుగడుగులులేసి వెనక్కు తిరిగి) కొత్త బెల్లపుముక్క వేయమంటావు నాయనా.

నారా : వెయ్యి.

**(శాంతమ్మ లోపలికిబోయి ఒక ఒక గ్లాసులో పాలు మరో ఖాళీ గ్లాసు దీసికొని ప్రవేశించి పాలు తిరగబోస్తూ)**

శాంత : తాజెడ్డకోతి వనమల్లా జెరిచిందని నీవు చెడేవాడివి చెడగా పుల్లయ్య వాళ్ళనుకూడా బజారుకీడ్చి పాడు జేత్తన్నావని వాడెందుకురా. కలిగిన మాత్రం కల్లో గంజో తాగి కొంపలో పడివుండక.

పుల్ల : మాకోసం పడరాని బాధలు పడుతున్నాడుగాని వాడు మమ్మల్ని పాడుజేసిం దేముందక్కయ్యా.

శాంత : అదిగాదు నాయనా. ఒక గానొక బిడ్డ. నా అనే దిక్కులేదు. ఈ గొడవలన్నీ యీడి కెందుకయ్యా. (పాలగ్లాసు పుల్లయ్య కందిస్తుంది.)

నారా : గొడవేముందమ్మా. నాన్నా. నీవూ కష్టపడి నాలుగు ముక్కలు చెప్పించారు. నాకు తెలిసిందేదో మనవాళ్ల నలుగురికీ చెప్పడం తప్పా.

శాంత : తప్పా ఒప్పా యెవరికి గావాలి నాయనా. యెవళ్ల మంచి వాళ్లు చూసుకుంటారుగాని. ఇన్నిటికీ మీ నాయనే వుంటే నిన్నిట్టా తిరగనిచ్చేవారేనా ? అబ్బాయి బెజవాడనుంచి రాగానే జమీందారుగా రుద్యోగ మిత్తానన్నారని యెంత మురిపెంగా జెప్పుకునే వారు. (కళ్ళనీళ్లు బెడుతుంది)

పుల్ల : (పాలు త్రాగి గ్లాసు కిందబెడుతూ) మేమంతా కల్లో గంజో తాగుతూ వాణ్ణి తిండిలేక చచ్చిపోనిస్తామా అక్కయ్యా. మాఅండ వాడికి, వాడి అండ మాకు.

నారా : అమ్మా, జమీందారీ ఉద్యోగమా, పంటలుపండినా యెండినా దయాదాక్షిణ్యాలులేకుండా శిస్తులువసూలు జేయాలిగదా ? పూటకు గంజికి గతిలేక అలో లక్ష్మణా అని అల్లాడే కూలీలచేత వెట్టిచాకిరీ చేయించాలి గదా......

ఫుల్ల : అంతేనా. ఆడు కోరిన దాన్నల్లా తెచ్చి తార్చద్దూ?

నారా : అవును. ఇదేగా జమీందారీ ఉద్యోగమంటే. చెయ్యక చెయ్యక యీ దిక్కుమాలిన ఉద్యోగమే చేయమంటావా అమ్మా, చెప్పు.

శాంత : అయ్యో, నా జిమ్మడ. నేనెంత తెలివితక్కువదాన్నయినా ఆ దిక్కుమాలిన ఉద్యోగమెట్టా జేయమంటానురా? సదువుకున్నాడివి గనుక యెక్కడన్నా బతుకుతెరువు చూసుకోమన్నాగాని.

ఫుల్ల : బతుకుతెరువు కేమిటిలే అక్కయ్యా.

నారా : ఆ దారేదో మీరే చూపించారుగా చూడు. మన వాళ్లంతా యేలాటి దుస్థితిలో వున్నారో - రాత్రింబగళ్లు కష్టపడ్డా పొట్టకు పట్టెడన్నం, కట్టుకోడానికి గుడ్డా, లేక నానా బాధలూ పడుతున్నారు. అంతా కలసి మెలసి, మంచీ చెడూ ఆలోచించుకొని, ఒక బాటన నడుస్తూవుంటే యీ జమీందారుల దుండగాలు, యీ తాబేదారుల లంచగొండితనాలు యిలా మితిమీరిపోతయ్యా, ఇదంతా యెందుకమ్మా. ఫుల్ల య్యమామ యేం జేశాడని కొట్టించినట్లు? అమ్మాం, కాస్త ఉదారంగా ఆలోచించి, యీ స్థితి లో మేమే చెయ్యాలో నీవేచెప్పు.

ఫుల్ల : రామయ్యబావ బతికుండగా తనచేలో యెదేసుకుంటూ యెట్టికి నాగలి రానియ్యలేదని ఆయన్ని

నానా బాధలుబెట్టాడు యీ నాగేంద్రం. ఆమెకు మాత్రం తెలియదటరా వీళ్లుబెట్టే యిబ్బందులు.

శాంత : ఏమోలెండిరాబాబూ. మీకు నేనేం చెప్పగల్దును? మీరుమాత్రం పొద్దోయి పోరటోయి తిరిగి రాకం డయ్యా, కాలం బాగుండలేదు.

నారా : అలాగేలే అమ్మా, భోంచేద్దాం పద. (లేచి) పుల్లయ్యమామా, లే, పక్కేస్తా.

పుల్ల : నే నేసుకుంటాలే బాబూ. మీ రన్నం తినండి. (మంచం మీదనుంచి లేస్తాడు. శాంతమ్మ లోపలి కెళ్ళుతుంది. నారాయణరావు పక్క వేస్తూవుంటాడు.)

( తెర పడును )

4

[అచ్చయ్యగారి ఆవరణలో పూలతోట. విమల తన చేతిలో వున్న పుస్తకం బల్లమీదబెట్టి యేదో ఆలోచిస్తూ వుంటుంది. ఇంతలో కోయిలకూత వినపడుతుంది]

శివరంజని - జంపె

విమల : పల్లవంబులుమేసి చల్లగా గూర్చుండి
ఏలపాడెదె కోయిలా - నీపాట
కెవ్వరానందించనే కోయిలా
యెవ్వరానందించనే
నీ చెణుకు బెణుకులు నీ తేనెపలుకులు
ఆనందమిచ్చునటనే - ఈనాడు
అన్నార్తులకు కోయిలా - కోయిలా
అన్నార్తులకు కోయిలా
బానిసలమై మేము పరితపించుచునుండ
ప్రణయగీతలు పాడెదే - నీవిట్లు
పరిహసించుచు నుండెదే - కోయిలా
పరిహసించుచు నుండెదే ॥పల్లవం॥

(అచ్చయ్య ప్రవేశించి పాటవింటూ వుంటాడు)

అచ్చ : అమ్మా,

విమల : నాన్నా,

అచ్చ : ఏ జేస్తున్నావమ్మా!

విమల : ఏమీ లేదు నాన్నా. ఇంత సేపటిదాకా రాలేదేం?

అచ్చ : రాని స్తేగా జమీందారు. ఎంతమర్యాద జేశాడమ్మా కాసిని మంచినీళ్ళు తెచ్చిపెట్టమ్మా (విమల మంచి నీళ్ళు తేవడానికి వెళ్ళుతుంది. అచ్చయ్యాగా రక్క- డున్న బల్లమీద కూర్చుంటాడు. బల్లమీదవున్న పుస్తకం తీసి చూచి) స్త్రీ స్వాతం ... త్ర్య, స్త్రీ... స్వా ... తం ... త్ర్యం. ఎడ్క-డిదీదిక్కు-మాలిన పుస్తకం (లోపల పేరుజూచి) ఓహో నారాయణరావా, (పండ్లు గొరుకుతూ) నా ... రా ... య ... ణ ... రా ... వు. హుః (ఆలోచిస్తూ పరధ్యానంగా వుంటాడు)

విమల : (మంచినీళ్ల గ్లాసుతో ప్రవేశించి) ఏమిటి నాన్నా ఆలోచిస్తున్నారు.

అచ్చ : (గ్లాసందుకుంటూ) ఏముందితల్లీ, ఇవ్వాళ మీ అమ్మేవుంటే (మంచినీళ్లు తాగి) ఎంతగా సంతోషిం చేదో. బ్రతికిన్నాళ్లు 'అమ్మాయికి బాగా చదువూ సంగీతం చెప్పించాలండి' అంటూ వుండేది. అమ్మే

పట్టుబట్టకపోతే నీకీ చదువే వచ్చేదిగాదు. తీరా ఆమె కోరికతీరే ఘడియ వచ్చేసరికి చూచుకునే ప్రాప్తం లేకుండా పోయింది. (విమల కొంచెం విచారంగా వుంటుంది. అచ్చయ్య బిడ్డను దగ్గరకు తీసుకొని తల నిమురుతూ) ఆ జ్యోతిష్కుడెంత గట్టివాడమ్మా. అతను జెప్పినట్టే జరుగుతోంది.

విమల : ఏం జెప్పాడేం ?

అచ్చ : (నవ్వుతూ) నీ వొక రాణివవుతావని. (విమల ముఖం చిట్లించుతుంది.) నీవు నా పేరు నిలబెట్టటానికి పుట్టావమ్మా. కాకపోతే జమీందారంతటివాడు నన్ను పిలిపించి సహపంక్తిని భోంచేసేటప్పుడు ఈ ప్రస్తావన తెచ్చాడంటే, నిజంగా నీ వదృష్టవంతురాలివమ్మా.

విమల : (విసుగ్గా) ఎంత అదృష్టం ?

అచ్చ : ఇంకా చిన్నతనం. నీకేం తెలుసు. ఆయనకేం వంకుందమ్మా. చక్కని వర్చస్సు, కావలసినంత ఐశ్వర్యం, నౌకర్లు, చాకర్లూ దేవేంద్రవైభవం. కలెక్టరులాంటి వాడు కూడా ఆయనమాట కాదనలేడు. ఆయనకేమమ్మా మహారాజు.

విమల : అవును. మహారాజు. ఎంతమందిని పొట్టపెట్టుకుంటే మహారాజయ్యాడో.

అచ్చ : పొట్టన బెట్టుకుంటున్నాడా ?

విమల : కాకమరేమిటి? కొంపలు జప్తుచేసి ఇంటిల్లపాదీ పిల్లా జల్లా గొల్లున గోలబెడుతూండగా బైటికీడ్పించడం, అదేం పాపమంటే దొంగచాటుగా తలకాయలు పగులగొట్టించడం, ఇరవై నాలుగు ఘంటలు తప్ప తాగి గంతులు వేయడం, చేసుకున్న పెండ్లాన్నిసైతం నానా చెరలుబెట్టి హింసించడం...

అచ్చు : అన్నీ యిలానే వుంటాయి. మొదట్లోనే తనకా సంబంధం వద్దని ఆయన గట్టిగానే జెప్పాడు. అయినా పెద్ద దొరగారు మేనరికం యెక్కడ బోతుందోనని పట్టుబట్టి చేశారు. ఎన్నాళ్ళు జూచినా ఆయనకూ ఆమెకూ పొసగలేదు. ఏంచేస్తాడు పాపం! కావలసిన డబ్బూ దస్కం యిచ్చి శుభ్రంగా ఒక బంగళా కట్టించి హాయిగా బతకమన్నాడు. ఇందులో ఆయన జేసిన తప్పేముంది?

విమల : (వ్యంగ్యంగా) ఏముంది పాపం. ఇవ్వాళ యింకొకర్ని జేసుకుంటాడు. రేపింకో బంగళా వేయిస్తాడు. ఎల్లుండి మూడోపెండ్లికి తయార్.

అచ్చు : అబ్బే. ఈసారి అట్లా యెందుకు జరుగుతుంది. ఆయనే కావాలని కోరి చేసుకుంటూవుండె.

విమల : ఆయన కావాలంటే సరి అయినట్లే. ఎదటివారి యిష్టమయితేనేం కాకపోతేనేం?

అచ్చ : (విచారంగా కూతుర్ని బుజ్జగిస్తూ) అమ్మాయీ, అది కాదమ్మా. ఒక్కటాలోచించు. నాకంటె నీ క్షేమం కోరేవారెవరున్నారు? చిన్నప్పటినుంచి యెంతో అల్లారు ముద్దుగా పెంచాను. పెద్దదాన్ని చేశాను, అమ్మా. నిన్ను చూచుకొని మీ అమ్మను కూడా మరచిపొయ్యాను. ఎంతమంది నన్ను పెండ్లి జేసుకోమని హెచ్చరించినా, నీసౌఖ్యం కోరి నీకెంతో పెద్ద సంబంధం తేవాలని, చివరకు నా పెండ్లికూడా మానుకున్నాను. నీమేలు కోరి మాట యిచ్చాను. ఇంతవరకు నామాటెక్కడా బీరుపోలేదు. పెద్దవాణ్ణి. నా పరువు నిలబెట్టవూ? అమ్మవు కాదూ? నిలబెట్టవు తల్లీ?

విమల : నిజమే నాన్నా. యిన్నాళ్లూ పెంచి పెద్దదాన్ని చేసి చివరకో కసాయి చేతిలో పెడతామంటున్నారు. ఇన్నిటికీ మాఅమ్మే వుంటే నన్నడగకుండా యిలా చేస్తుందా? అందుకనే తల్లి లేకపోతే తనువే లేదన్నారు.

(విమల విచారంగా వెళ్ళిపోతుంది. అచ్చయ్యగారు దీనంగా కూతురివైపు చూస్తుంటాడు. ఇంతలో తెరవెనుక పాట వినబడుతుంది. నారాయణరావు. వలంటీర్లు పాడుకుంటూ పోతూవుంటారు)

మోహన - ఆదితాళం

ఓ కర్షక వీరకుమారా లేరా ॥ఓ కర్షక॥

క్రూర జమీందారీ బాధలతో, మారణమై పోనేలాలేరా
అనయము శ్రమపడుచుండెడు నీకూ అన్నమే లేదా,
అన్నమే లేదా ఈవేళా లేరా

రారా కర్షక తనయా రారా లేరా రారా
లేరా కర్షక తనయా రారా లేరా రారా
భారత భాగ్యవిధాతవు నీవో రైతా
బానిసత్వమున పడి యిటు చావగనేలా
కూడదీసికొని నీ సోదరులను
పీడన పద్ధతి నిపుడెదిరింపన్
వేగరారా ముందుకిపుడే రారా ॥రారా కర్షక॥

చావుదప్ప దెప్పుడైన సాగిరమ్మురా
పోరుసల్పరా పేరునిల్పరా
అన్ని మూలలం కిదే నినాదం
బందజేయరా కర్షకవీరా లేరా. ॥రారా కర్షక॥

అచ్చ : (కోపంతో) నేటి కీ గ్రామానికి ముసలం బుట్టింది. పనీ పాటా లేక అడ్డగాడిదల్లాగా తిరిగే పోకిరీ రక మంతా చేరి గ్రామాన్ని నాశనం జేస్తున్నారు. (పోవును)

# 5

దివాణం:

(చక్రధర్రావు, రామ్, సిగరెట్లు కాలుస్తూవుంటారు)

చక్ర : ఏరా రామ్, మోహన్ ఉత్తరమన్నా రాయలేదేరా.

రామ్ : ఉత్తర మెందుకు? అసలు బొమ్మనే దించుతాడు. వెళ్లి నాలుగు రోజులేగా?

చక్ర : ఏమో వాడు వట్టి లేజీ ఫెలో. నీవెళ్లినా బాగుండేది.

రామ్ : అక్కరలా. వాడేం సామాన్యుడా? దాన్ని మద్రాసు దాటించడమంటే మాటలా! చెత్తాకానీరకం కాదుగా? అంత తేలిగ్గా బైటపడ్డానికి. అసలు మనం వెళ్లితేనె బాగుండేది. ఈ వెధవ తగాదా మూలాన ఆగాలిసి వచ్చింది.

చక్ర : ఏది యెలావున్నా, ఈ రైతుల్ని ఒక్కంట కనిపెట్టి వుండాలి. లేకపోతే ఏకు మేకవుతుంది. వీళ్లను కాస్త తలెత్తనిస్తే మన ఆటలు సాగవు.

రామ్ : గుడ్డికన్ను తెరిస్తే యెంత? మూస్తే యెంత? ఈ పీనుగలు చేసి చచ్చేదేమిటి?

చక్ర : అమ్మా! అలా అనకు. కన్ను మూయడానికి వీల్లేను వీళ్ల సంగతి తేలేవరకు. చీల్చి ఎండెయ్యాలి. గాడ్దెలు.

(నాంగేద్రం ప్రవేశించి నమస్కారం చేస్తాడు)

చక్ర : ఓహో, కూర్చో. అనుకున్న పని జరిగిందా ?

నాగేం : మనం ప్లాను వెయ్యడం, జరక్కపోవడం కూడానా.

రామ్ : సెబాష్. దొరకుతగ్గ తాణేదారువయ్యా.

చక్ర : ఎక్కడ దొరికాడోయ్ ?

నాగేం : సిరిపురంలో మీటింగుబెట్టి తిరిగి వస్తున్నారు. ఏవేవో లేత లేత సొరాకాయలు గోస్తూ కబుర్లుజెప్పు తున్నాడా కుర్రకుంక. పుల్లయ్యగాడేమో, ఊఁ గొడు తున్నాడు. వెధుళ్ళవాగులో దిగీదిగడంతోనే (చిటికేస్తూ) యిట్లా అన్నా. మన పిల్లిభీముడు వెయ్యనే వేశాడు, దెబ్బకు గింగిరాలు తిరిగి అవతల బడ్డాడు చిత్రబిళ్ళలాగా – ఎంతమందుంటే నేం ?

చక్ర : దెబ్బకు ఖూనీ అయిపోయాడన్నమాట,

నాగేం : కాకపోతే- ఒకవేళ బ్రతికి బయపడ్డా అవిటిబ్రతుకే లెండి.

రామ్ : అదీ యెత్తంటే, సూత్రాలు తిరిగిపోవాలి.

చక్ర : భేష్ నాగేంద్రం, మొనగాడివంటే నీవేనోయ్.

నాగేం : (ముసిముసి నవ్వులు నవ్వుతూ, చేతులు నలుపు కుంటూ) ఇంతకూ తమ దయేవుండాలిగాని, ఈలాంటి

వెధవలోక లెఖ్ఖా. రోజుకొకణ్ణి తన్ని బైటికీడ్పించనూ.

(వెంకన్న ప్రవేశించి చివరవాక్యం విని)

వెంక : మీ పాదాలకు మొక్తా బాబూ, పిల్లలగలాణ్ణి. ఈడ్పిత్తే చచ్చిపోతా. (అందరూ నవ్వుతారు) అచ్చయ్యగారిని కేకేసి, గుక్కెడు సద్దిదాగి వత్తుండ బాబూ.

చక్ర : ఏడిరా అచ్చయ్యగారూ?

వెంక : అన్లీకోళ్ళ బాబూ. బాగానేవుండాయి. ఇప్పుడే నీళ్ళుదాపి వత్తుండా బాబూ.

రామ్ : (నవ్వుతూ) నీపిండాకూడు. పిచ్చిముండాకొడకా.

నాగేం : కాదురా, నీ తలకాయ. అచ్చయ్యగారేర్రా.

వెంక : అచ్చయ్యగారా. వత్తున్నారండి. రాములోరి గుడికాడ పుల్లయ్య ఎదురై ఏదో గొడవసెప్తుంటే యింటా నుంచున్నారు.

చక్ర : (నాగేంద్రంవైపు గుర్రురిమిచూస్తూ) ఏడ్చావు వెధవేదవ్వ. నీయేడ్పు తగలెయ్య.

(నాగేంద్రం తలవంచుకుంటాడు)

రామ్ : వెళ్తానండి. మోహన్ ఏమయినా వుత్తరం రాశాడేమో పోస్టాఫీసుకెళ్ళి చూస్తా (జమీందారువైపు జూస్తూ పక్కకు నడుస్తూ వుంటాడు. ఇంతలో అచ్చ

య్యగారి ప్రవేశం. అచ్చయ్యగారిని తీరా ముఖం దగ్గర కొచ్చేటప్పటికి చూచి) గుడ్ మార్నింగ్ అండీ అచ్చయ్యగారూ.

(అచ్చయ్యగారు రామ్‌వంక అసహ్యంగా జూస్తాడు. రామ్ ఎడంగా తొలగి వెళ్ళిపోతాడు)

చక్ర : ఓహో అచ్చయ్యగారా దయచేయండి (కుర్చీ చూపెడతాడు. అచ్చయ్యగారు నమస్కారంచేసి కూర్చుంటాడు వెంకన్న. బైటికి వెళ్ళిపోతాడు.)

అచ్చ : తమరు రమ్మన్నారని వెంకన్న చెప్పగానే బయలుదేరి వస్తున్నాను. రామమందిరం దగ్గిర కొచ్చేసరికి పుల్లయ్య యెదురయ్యాడు తలకో కట్టు కట్టుకొని. వీడి సరుకెంతవరకుందో చూద్దామని 'తలకా కట్టేమిట్రా పుల్లయ్యా' అన్నా. "నా నోటితో చెప్పించాలనిగాని నీకుమాత్రం తెలియకుండా ఉన్నదటలేవే" అంటున్నాడు. ఇంతలో ఎక్కడనుంచో వూడిపడ్డాడు ఆలీడరుగాడు నారాయణ. రావడంతోనే యిక యెత్తుకున్నాడు నాయనా ఎవరో కాడీలట. తామేమో వూరినించి వస్తూవుంటే దారిగాచి దొంగేడ్చేడ్చారట. ఇదంతా జమీందారుగారి చలవేనట. ఇంకా యేమేమో వాగాడు.

చక్ర : వాగుతాడు వాగుతాడు ఒక తడిపడితేగాని

అచ్చ : అనపగుగ్గిళ్లు గాదంటో తేలికగా నమలడానికి. యినప గుగ్గిళ్లు.

చక్ర : ఇనపగుగ్గిళ్లు......హుం...మూసలో పోసి కరిగితే సరి ముద్దయి వూరకుంటాయి.

అచ్చ : నిజమే అనుకోండి. తరవాత మాట యెలావున్నా ప్రస్తుతం నలుగురూ నారాయణా నారాయణా అంటూ వుంటే ముందుగతి గానక రొమ్ము విరుచుకు తిరుగుతున్నాడు వెధవ!

నాగేం : తిరక్క వాడికేం? మనిషికో సంఘం బెట్టాడు; ఆకాశానికి చుక్కలు నేనే తగిలించా నంటున్నాడు.

అచ్చ : మనిషికో సంఘమంటే జ్ఞాపకమొచ్చింది. మహిళా సంఘాలట, మహిళాసంఘాలు! ఇదివరకున్నవి చాలక ఊళ్లో యేమూల కెళ్లినా ఆ పిచ్చి పాటలే.

చక్ర : అందాకా వచ్చిందీ వ్యవహారం.

నాగేం : ఏముంది? అమాయకుల్ని మాయజేయడానికి ఇదొక దారి.

అచ్చ : ఏడ్చాడు వెధవ.

నాగేం : అంతగాక యింకెంతలెండి. బుద్ధులు భూములేల్తూంటే రాత గాడ్దెలు గాస్తూవుంది. వెధవకు తగిన ప్రాయశ్చిత్తం జరిగితేనేకాని తలదిమ్ము వదలదు.

చక్ర : ఈలాంటి నీచులు నావూళ్లోవున్నా దరిద్రం.

అచ్చు : ఈ దౌర్భాగ్యుడు వూళ్లో కాలుబెట్టినప్పటినుంచీ వూరంతా నాశనమైపోయింది. కడుపులో చల్ల కదల కుండా హాయిగా కాలక్షేపం జేసే గ్రామంలో అన్నీ కలతలే. తండ్రికీ బిడ్డకూ రైతుకీ రాజుకూ చివరకు మొగుడూ పెండ్లాలమధ్య కూడా తగాదాలు పెడు తున్నాడు. ఈ శనిగ్రహంవదిత్తేనే మళ్ళీ గ్రామాని కేమయినా మోక్షం.

చక్ర : శనివదిత్తే. యెప్పుడోనా? ఒక ఘడియకూడా వీడు నాగ్రామంలోవుంటానికి వీల్లేదు. నాగేంద్రం, తక్షణం మెడబట్టి బైటికి గెంటించేశెయ్ దరిద్రుణ్ని.

నాగేం : అదెంతపనిగాని... ...

అచ్చు : ఏముంది గొర్రెలమంద. సైరా కాటిగాఅంటే కాడి బుజానేసుకునేమచ్చు. వాడు వేయమన్న గంతల్లా వేస్తారు. పనిపాటల్లేక బేవార్సుగా తిరిగే పోకిరీరకం ఊళ్లో కొంతుందిగా. ఏది యెట్లావున్నా చేసే పని కాస్త జాగ్రత్తగా చేయడం మంచిది.

నాగేం : (చిటికవేస్తూ) దాని కిటుకు మనచేతిలో వుందిగా!

చక్ర : (ఆలోచిస్తూ) ఏమిటంటావు?

నాగేం : (అచ్చయ్యగారివైపు జూస్తూ) ఏమండీ, అచ్చయ్య గారూ వీడుండే ఇంటి పెరడు క్రితం యెస్టేటువారి సొంతం కాదండి.

అచ్చ : ఎస్టేటుదేకాని, రామయ్య బ్రతికివుండగా దానిక్రింద నజరానా వగైరా కొంత కట్టినట్లుందే.

నాగేం : ఏది కడితేయేం? దాని కేమయినా పట్టా, రిజిష్టరా.

అచ్చ : ఆఁ ఆఁ నిజమే.

చక్ర : సెబాష్ నాగేంద్రం. రేపీపాటికి వాణ్ని ఆ కొంప లోనుంచి వెళ్లగొట్టేశెయ్. దానితో పీడా వదులు తుంది.

నాగేం : చిత్తం. (లేచి నాలుగడుగులు వేస్తాడు)

చక్ర : రేపీపాటికల్లా వాణ్ని వెళ్లగొట్టి మరీ నాకు కనపడాలి సుమా. వెనుకటిమాదిరిగా జేశేవు, జాగ్రత్త.

నాగేం : చూస్తారుగా (వెళ్లిపోవును)

అచ్చ : పిట్టకొంచెం కూత ఘనమన్నట్లు కాస్తంతలేడు. ఊళ్లో యెంత విషప్రచారం చేశాడండీ మీామీాద.

చక్ర : ఇంతటితో వదలిపెట్టానూ. (మీాసం మెలివేస్తూ) వీణ్ని గోదావరి నీళ్ళు తాగించకపోతే నాపేరు చక్ర ధరావా?

అచ్చ : (ముసిముసి నవ్వులు నవ్వుతూ) తమరు తల్చుకుంటే అదెంతపనిలెండి. సెలవిప్పిస్తారా?

చక్ర : వెళ్ళొచ్చులేరాండి. (ఇద్దరూ లోపలకెళ్లిపోతారు)

# 6

## నారాయణరావు ఇల్లు.

[శాంతమ్మ కూరగాయలు గోస్తూ వుంటుంది. నాగేంద్రం, పిల్లి భీముడు వగైరాలు లాఠీలతో ప్రవేశిస్తారు]

నాగేం : చూస్తారేమిట్రా? సామానంతాలాగి అవతల పారే యక (పిల్లిభీముడు వగైరాలు సామాను బైటపారేస్తూ వుంటారు.)

శాంత : (అడ్డం వెళుతూ) అయ్యో, అయ్యో, ఇదేంపాపం. ఇదేం అన్యాయం, ఎవళ్ళురా మీరు మాయింట్లో జొరబట్టానికి.

పిల్లిభీముడు : పోఅమ్మో. పో -అరవమాకు. అన్యాయమంట అన్యాయం, (పుస్తకాలుతీసి బైటికి గిరాటేస్తూ వుంటాడు.)

నాగేం : ఏంయ్ ముసలమ్మా, ఇల్లు నీబాబుగాడి సొమ్మను కున్నావా? నడువ్ బైటికి.

శాంత : మీకేం బిడ్డాపాపా లేరంటరా? రాళ్ళుగన్నారా?

నాగేం : నోరుముయ్, నీవు కన్నావుగా దేశాన్ని వృద్ధించే కొడుకుని. చాలదూ?

పిల్లిభీ : ఏయ్ ముసలమ్మా, జాగ్రత్తగా రానియ్యి మాటలు.

రాడి : (నాయకుల ఫొటోలుతీసి బైట పారేస్తూ) మింగ డానికి మెతుకులేదు. యీడి కొంపకుతోడు ఫొటోలట ఫొటోలు.

శాంత : నీకేం పొయ్యేకాలం వచ్చిందిరా? మెతుకు లేక పోతే మీరు తెచ్చిపెడతన్నారంటరా? మీాజిమ్మ దీయ.

రాడీ : ఆఁ అట్టాగే మొరుగుతూ వుండు. అంతపని జరిగే దాక. (ఏకులబుట్ట కాలితోతన్ని రాట్నం బైటకు తెస్తూవుంటాడు)

శాంత : ఏంజేత్తార్రా. చంపుతార్రా. చంపండిరా చచ్చి నోళ్ళల్లారా. (రాట్నానికి అడ్డం వెళ్ళుతుంది)

నాగేం : (కోపంతో) మూాడు దమ్మిడీలుచేయని యీా ముసలి ముండ ఆపడం మేం ఆగడమూ? (శాంతమ్మని రెక్క బట్టి బైటికి నెడతాడు)

శాంత : (క్రిందపడిలేస్తూ) ఎన్నాళ్లు సాగుతుందిరా మీా ఆగడం. పాపం పండింది. మా వుసురు తగలకపోతుం దటరా? పైన దేవుడు లేడూ?

(శాంతమ్మ ఏడుస్తూ వుంటుంది. సామానంతా బైటపడేయించి నాగేంద్రం యింటికి తాళంవేసి గబగబా వెళ్ళిపోతాడు. ఇంతలో పుల్లయ్య వచ్చి నివ్వెరపోయి చూస్తూవుంటాడు.)

శాంత : అయ్యో, చూడరా నాయనా పుల్లయ్యా. ఎంత దండగంచేశారో, వీడి వుద్యోగం ఊడ్చిపెట్టుకపోను. ఆడకూతురని అయినా అనుమానించకుండా అడ్డమయిన మాటలన్నాడురా? (ఆవురుమంటుంది)

పుల్ల : ఊరుకో అక్కయ్యా. వూరుకో. వాడికీ రోజులు దగ్గిరకొచ్చాయి. వూళ్ళో ఎవళ్ళూ లేకుండాజూచి ఎంత పని చేశార్రా దొంగ గాడ్దెకొడుకులు.

వీరయ్య : (ప్రవేశించి) సమయాని కుండకపోతిమి. సావో బతుకో తేలుసుకునేవాళ్ళం.

పుల్ల : ఆ వరదాకా యింటికాడే వుండారా. ఆ నాలుగు వంగపాదులూ ఎక్కడ గొడ్లు పాడుజేస్తయ్యో నని అన్నంతిని అప్పుడే అట్టా బైటకెల్లా. ఇంతలో కుర్రాడు రొప్పుతూ రానేవచ్చాడు. "బాబూ, బాబూ, ఎవళ్లో జమీందారు మనుసులంట. శాంత మ్మత్తయింట్లో సామానంతా బైట పారేస్తున్నా రంటూ" ఆదరాబాదర వచ్చేటప్పటికి తాళంవేసి పోచేపొయ్యారు. ఎదవనాయాళ్లు. నన్నుజూచి శాంత మ్మక్కయ్య ఆవురుమందిరా. కడుపు తరుక్కు పోయింది.

కాసిం : (ముచ్చెమటలతో హడావుడిగా పరుగెత్తుకొచ్చి) అరే హెక్కా సచ్చాచ్ మస్జీ జనం అంతా. మీకీ

ఖలేజా నై. నాకీవుంటే బిస్మిల్లా సేయకపోయానా వాడీక్కి.

పుల్ల : సమయానికంతా పొలంలోనే సస్తిమి. తీరా వచ్చేటప్పటికి తాళం వేయనూ వేశారు. పోనూ పోయారు.

కాసిం : బద్మాష్... అరె యిష్టూ ముసీపోయిందీ క్యా. తాళం గీళం తుఖ్డా తుఖ్డా కావాలి. చలో భాయి చలో.

వీర : కాసిం. మళ్లా వాడేమంటాడో కాస్త ఆగండి. ఆడూ వచ్చేయాళయిందిగా.

కాసిం : ఏ క్యారే, ధూత్. (నిరాశతో పంచ నేలకేసికొట్టి చదికిలబడతాడు)

(కోటయ్యతో సహా నారాయణరావు ప్రవేశం, నారాయణరావు చేతిలో ఒక సంచిమాత్రం వుంటుంది.)

వీర : అరుగోరా, మన నారాయణ కోటయ్యలు రానే వచ్చారు.

శాంత : వచ్చావురా నాయనా. ఎంతగతి పట్టిందిరా! (ఎదురుగా వెళ్లి కౌగిలించుకొని యేడుస్తుంది. తల్లిమీద చేయివేసి నారాయణరావు గంభీరంగా నుంచుంటాడు. రైతులందరూ విచారంగా వుంటారు.)

నారా : ఇంతమాత్రానికే అధైర్యపడితే యెలా అమ్మా (నారాయణరావు కొంచెం వెనక్కు తప్పుకొని సంచి

ఒకపక్కన బెడుతూ) దుర్మార్గుడు ఎంత అవినీతిక యినా పాలుపడతాడు. మనం బలపడితే వాడిష్టం వచ్చినట్లు నాటకమాడటం కుదరదని మొక్కలోనే మన సంఘాన్ని తుంచివేయాలని చూస్తున్నాడు. ఎన్ని పిచ్చికళలు జేస్తే అంతత్వరగా నాశన మవు తాడు. ఇంకెన్నాళ్లు వీడి ఆటలు.

శాంత : ఆడికేం నాశనమవ్వాను ?

కాసిం : అరే, వేదాంతం బోల్తేక్యా బాబా. తాళం గీళం హిఫ్డా పగలగొట్టావాలి.

కోట : ఏమయినా సరే తాళం పగలగొట్టాలసిందే.

నారా : మనమలా తొందరపడటం మంచిదికాదు.

కాసిం : అరే ! ఎవడీ యింట్లో వాడూ దూరేదీ కూడా తప్పే !

నారా : దానికి చాలా చిక్కులున్నాయి కాసింభాయి. ఇల్లు వాడి స్వాధీనమై తాళం వేసుకున్నతర్వాత మళ్ళీ మనం వెళ్లి తాళం పగలగొట్టటమంటే అదొక పెద్ద కేసవుతుంది.

కాసిం : (తెల్లపోవును)

వీర : కేసా ? ఎందుకు కేసు ?

నారా : ఎందుకా? అమాయకుడు మానాన్న ముందు డబ్బు గట్టాడు. చచ్చిందాకా వాడిచుట్టూ తిరిగినా పట్టా యివ్వలా రిజిష్టరూ చేయలా.

పుల్ల : అయితే యిక యిల్లు వదలిపెట్టి వూరుకోవాలిసిందే!

నారా : ఆ విషయంలో ముందు ప్లీడరుతో సంప్రదించి తర్వాత వ్యవహారానికి దిగడం మంచిది. అయినా యేపని చేయాలన్నా ముందు గ్రామంలో మనకు తగినంత బలముండాలి. ఇంకా కొందరు అమాయక ప్రజలు వాడిమోసం గ్రహించలేకుండా వున్నారు. వూరంతా ఒక తాటిమీద నడిచినప్పుడే యీ రాక్షస కృత్యాలన్నిటినీ యెదుర్కోగలం. అప్పుడుగాని వీడి ఆట కట్టదు.

కోట : అంతా ఒక కట్టునే కాస్తే యింకా అడిగేదేముంది?

నారా : ఓపిక బట్టాలి. అచ్చయ్యగారిలాంటి స్వార్థపరులింకా కొందరు జమీందారు వెనుక తాళం వేయబట్టే వాడి వ్వాళ మనింటికి తాళం వేయగలిగాడు.

పుల్ల : తాళంమాట కేమొచ్చెలే, ముందు నీవు పోయి ప్లీడర్ని సరిగ్గా కనుక్కో. నీకేం, ఉంటానికి ఊళ్లో కొంప తక్కువవుతుందా?

నారా : వాడి ఉద్దేశమయితే అదే.

పుల్ల : నీ కా యిల్లు దొరకంది! నీయిష్టమొచ్చినన్నాళ్లుండు మాయింట్లో. చేసే తల్లకిందులేమిటో చూస్తా.

కాసిం : మాకీ మన్సీసూలుండాం – జాన్వర్ హూలుండాం. మాదీ బొందిలో పాణం హులుండ్గా మీకీ హెల్లాగొడతాడ్.

కోట : ముట్టెత్తుకోనయినా బతికించుకుంటాం గాని నిన్ను పోనియ్యకేం?

శాంత : ఏమోనాయనా ఆడికి తల్లీదండ్రీ అంతా మీరే.

పుల్ల : నారాయణ నీబిడ్డగాడక్కయ్యా, మాబిడ్డ.

శాంత : మీరంతా అట్టావుండాలిగాని నాయనా, నాకింత కంటే ఏం గావాలి. ఆకొంపవుంటేం వూడితేం?

పుల్ల : బలేమాటన్నావక్కయ్యా (చేతితో రాట్నం బట్టుకుంటూ) అరే కోటయ్యా తలాఒకటి పట్టుకోండిరా. అబ్బాయి, అక్కయ్యా! పోదాం పదా.

**(తలా ఒక సామాను తీసుకొని నడుస్తూవుంటారు)**

నారా : (సంతోషంతో)

అమితోల్లాస విలాసముట్టిపడ నిట్లాబాలగోపాలమున్
తమ సర్వస్వము ధారవోసి కటిబద్ధంబై యెను రొక్కన్న, రా
జ్యము లెల్లన్ తలక్రిందులై చనవె? కష్టంబుల్ పటాపంచలై
సమతాసూత్రావిధాన కల్పిత మహాసౌఖ్యాబ్ధి నోలాడమే?

# 7

## అచ్చయ్యగారిల్లు

[విమల తన గదిలో కూర్చొని "స్త్రీస్వాతంత్ర్యం" అనే పుస్తకం తీసి చదువుతూ వుంటుంది. గదిలో టేబులు, కుర్చీలు, బీరువా, అద్దం వగైరా]

ధనమున కాశించి తనయను గొంపోయి
ముదివగ్గుకిచ్చెడు మూర్ఖుడొకడు
మంచిసంబంధంబు మించిపోవునటంచు
చిన్నపిల్లకె పెండ్లిజేయునొకడు
మేనరికానికి మించినదేమంచు,
ఈడుజోడైన యోచింపడొకడు
చెడురోగముల బాధపడు జారునకునైన
గుణవతి పుత్రికన్ గూర్చునొకడు
బిడ్డలకు విద్యలన్ని నేర్పించి తుదకు
ఓనమాల్ రాని శుంఠల కొసగునొకడు
ఆడుబిడ్డల నిటు కడుపార గాంచి
పెంచి కటికి కసాయి కర్పించనగునె?

ఝాన్సీలక్ష్మినాటి స్త్రీ శక్తియేది?
నివురు గప్పెనె! నిప్పపై నేటికహహా!
జగతివెరగంద మీశక్తి చాటుడమ్మ
మరల నొకమారు భారత తరుణులారా.

(అచ్చయ్యగారి ప్రవేశం)

విమల : (తండ్రిని చూడగానే లోపలున్న నౌకరును కేక వేస్తూ) అప్పన్నా, నాన్నగారు వచ్చారు. నీళ్ళు తీసుకరా!

అచ్చ : నీళ్ళెందుకమ్మా.

విమల : భోజనం చెయ్యరూ.

అచ్చ : దివాణంలో భోంచేసి వచ్చాగా.

విమల : (ముఖం చిట్లిస్తూ) ఉహుc.

అచ్చ : ఆయన ఎంత మర్యాదస్తుడమ్మా. నౌకర్లన్నం వడ్డించారు. ఏదో పిచ్చాపాటి మాట్లాడుతూ ఇద్దరం సహపంక్తిన భోంచేస్తున్నాం. మాటల సందట్లో గిన్నెడు నెయ్యి ఒక్కసారి వెండిపళ్లెంలో గుమ్మరించాడు తనచేత్తో.

విమల : (విసుగ్గా) ఇంకేం?

అచ్చ : అదిగాదమ్మా. మర్యాదకి జెప్పుతున్నా, మర్యాదకి. జమీందారంతటివాడు మనల్నిపిల్చి అంత గౌరవిస్తే

ఏదో ఉడతాభక్తి మనంకూడా ఒకసారి ఆయన్ని పిల్చి విందుజేస్తే బాగుంటుందని.

విమల : ఎవరు వద్దన్నారు?

అచ్చ : వద్దంటావని కాదమ్మా. వెనకటి కాలపు మనిషి మీ అమ్మ. దానికే వంటలూ చేతయ్యేవిగావు. నీవు చక్కగా కొత్తకొత్త పదార్థాలు కమ్మగాజేసి వడ్డిస్తా వనికాదూ నేను పిలవడానికి సాహసించింది.

విమల : ఏమిటీ, నేను వంటజేసి నా చేతుల్తో ఆ నీచుడికి వడ్డించాలా? శాంతమ్మ గారిలాంటి మానవతినిబట్టి బజారు కీడ్పించిన ఆపశువుకి.

అచ్చ : (కోపమాపుకొని) అవును. శాంతమ్మగారు మహా యిల్లాలే. అయితేనేం? ఆతల్లి కడుపు చెడబుట్టాడుగా యీ దౌర్భాగ్యుడు. జమీందారుగారు కూడా నా యెదుట "అచ్చయ్యగారూ శాంతమ్మగారిలాంటి మహా యిల్లాల్నికూడా యీ దౌర్భాగ్యుడి మూలాన బైటికీడ్పించాలసి వచ్చిందే" అంటూ నిజంగా కండ్ల నీళ్ళ పర్యంతమయ్యాడు.

విమల : కిరాతుడు ఎందుకు కార్చడు మొసలికన్నీళ్ళు.

అచ్చ : కిరాతుడా?

విమల : సందేహమా. కుయ్యో మొర్రో అంటూ వుండగా దిక్కులేని అనాధ స్త్రీలను బైటికీడ్పించేనాడు: పది

మందీ నోట్లో వూస్తారని యెగ్గూ సిగ్గూ లేకుండా కొంపలు తగులబెట్టించేవాడు......

అచ్చ : ఎవడా కొంపలు తగులబెట్టించింది ?

విమల : ఎవడా ? మీకు మెచ్చి మేకతోలుగప్పే జమీందారు. ఆడదాన్నయి పుట్టిన పాపాన చూట్టానికి కండ్లు లేకపోయినా వింటానికి నాకూ చెవులున్నాయి. రాక్షసుల్లాగా కొంపలు తగలబెట్టించింది చాలక 'మొగుణ్ణి గొట్టి మొర్రో' అని యేడ్చినట్లు సిగ్గులేక నారాయణరావు వాళ్ళమీద కేసులుకూడా బనాయించాడు.

అచ్చ : ఆ గాడిదపేరు నాయెదుట తేవద్దని యెన్నిసార్లు చెప్పినా తెస్తూనేవుంటావు మాటకుముందు నారాయణ నారాయణ. అన్నిటికి దొరికాడాక పోకిరీ వెధవ. నాలుగు తియ్యతియ్యని మాటలూ పాటలు చేర్చి కూలీలు రైతులు అని గొంతు చించుకొని అరుస్తూవుంటే నీబోటి తలకాయలేని రకమంతా ఉబ్బి తబ్బిబ్బై అదిరిపడి చస్తున్నారు. తనకొంప నున్నన చేసుకుంది చాలక పుల్లయ్య కొంపదీయడానికి కూడా సిద్ధమయ్యాడు. రేపిక నాకొంప దీస్తాడు.

విమల : ఎవడి కొంపదీసినా మీ నాగేంద్రం దీయాలి. మీ జమీందారు తీయాలి. అతను ఎవరి కొంపా తీయడు.

అచ్చు : ఛీ ఇదిమొదలు ఆ ఛండాలుడి పేరు నాదగ్గిర తెచ్చావంటే జాగ్రత్త! మాట దక్కదు.

విమల : ఎవరికంటె ఛండాలుడు? కొంపలార్చే మీ జమీందారుకంటేనా? నిరుపేదలై తిండిలేక మలమలమాడే కూలీ రైతులకోసం తన జీవితం ధారబోసే ప్రజాసేవకుడు ఛండాలుడట! ప్రజల రక్తమాంసాలు పీల్చి పిప్పిచేసి, మజాకోసం మానవహింస జేసే రాక్షసుడు బుద్ధిమంతుడట? నాన్నా, మీకు కోపం వచ్చినా సరే, కష్టమయినా సరే, యీ విషయంలో మాత్రం మీ మాట కాదనక తప్పదు. నేనెంత చిన్నదాన్నయినా, నాకెంత లోకానుభవం లేకపోయినా నాకూ, తెలుసు; వాడెందుకీ వుచ్చులు పన్నుతున్నాడో. నాకూ పదహారేండ్లు వచ్చినై. వాడీ గడపతొక్కాడా నే నీ యింట్లో వుండను. ఇన్నాళ్లూ పెంచి పెద్దదాన్ని చేసి చివరికే నూతికో, గోతికో ఒప్పగించదలచుకుంటే వాణ్ణి గడప తొక్కనించు. ఇదే నా ఆఖరు మాట.
(విమల వెళ్ళిపోతుంది; అచ్చయ్యగారు నిర్విణ్ణుడై దిగాలుపడి బిడ్డవైపు చూస్తూవుంటాడు.)



# 8

## పుల్లయ్యగారి యిల్లు

[నారాయణరావు బల్లమీద కూర్చొని 'భారత స్వాతంత్ర్యం' అనే పుస్తకం చదువుకుంటూ వుంటాడు]

చదువునేర్పగ పాఠశాల లున్నవిగాని,
చదువుకొనంగ విశ్రాంతి యేది?
సకల రోగముల కౌషధము లున్నవిగాని,
కొనితెచ్చి సేవించ ధనమదేది?
నవనవానేక యంత్రంబు లున్నవిగాని,
కార్యసాధన కధికారమేది?
ముక్కారునుం బండు భూములున్నవిగాని,
సాగుచేయగ సంఘ శక్తియేది?
అన్ని యుండియుగూడ లేవయ్యె నకట!
రైతు లోనరించినట్టి దౌర్భాగ్యమేమొ?
రమ్య సురభిళ పుష్పితారామసీమ
శ్రామికులకయ్యె భయద శ్మశానవాటి.

రెండు జాముల యెర్రని మండు టెండ
బండ చాకిరి జేయుచు కండ గరుగ
తిండి దొరకక పస్తుండి యెండిపోవు
కృషకబృందము, లెమ్ము, నీవే పునాది

శాంత : (ఏకుల బుట్ట తీసికొని రాటంవద్ద కూర్చుంటూ) ఎవర్రా అబ్బాయీ, మీమీద సాచ్చం సెప్పింది.

నారా : తాగుబోతు కొండయ్యొకడు, ఎవడు పావలా డబ్బిలిచ్చి యే కూత కూయమంటే అకూతగూసే సీత నొకడు; ఈలాంటి రకమేగా వాళ్ళకి దొరికేది.

శాంత : యేమని చెప్పారేమిట్రా ఆళ్ళు.

నారా : ఆవ్వాళ పొద్దున విత్తనాలు గావాలసి తాగుబోతు కొండయ్య పుల్లయ్య మామ దగ్గర ఉన్నయ్యేమో కనుక్కుందామని వచ్చాడట! అప్పుడు నేనూ పుల్లయ్యమామా తలుపు బిగించుకొని, యీ యింట్లోనే గుసగుస లాడుతున్నామట. "ఏమయినాసరే తప్పకుండా జమీందారుమీద కసి తీర్చుకోవలసిందే" అన్నానట నేను. "అదెంతపనిరా, మాపిటికగ్గిపుల్లగీసి బుర్రుమనిపిస్తే సరి" అని పుల్లయ్య మామ అన్నాడట. ఇదంతా వాడు తలుపుచాటున వుండి విన్నాడట. ఆరాత్రే యిల్లు తగులబడిందట.

శాంత : అయ్యో, వాడమ్మకడుపుగాల; ఎక్కడన్నా మనింటికే మనమే నిప్పెట్టుకుంటామట్రా! అదెట్టా నమ్మొత్తార్రా అబ్బాయీ, ఇంతిడ్డూరమా?

నారా : 'ఆ తగలడింది యెవరిల్లురా' అనీ కోర్టువారతన్ని అడిగితే "అది జమీందారుగారి యిల్లండీ, ఇది

వరకు వారి నౌకరుంటూ ఉండేవాడు. ఇప్పుడు ఖాళీగానే వుంటూం" దని చెప్పాడు. అది జమీం దారిల్లని కాక వాళ్ళు మన యిల్లని ఒప్పుకుంటారా అమ్మా. ఈలాగే మేము నిప్పెడుతూంటే చూశా డట సీతన్న. ఏముందీ వాళ్ళు వాగమన్నట్లల్లా వాగారు.

శాంత : ఆళ్ళ మనస్సెట్టా ఒప్పిందో యింత పచ్చి అబద్దా లాట్టానికి.

నారా : (చిరునవ్వుతో) అబద్ధ సబద్దం నీబోటివాళ్ళకుగాని తాగుబోతులకు లంచగొండులకు అబద్ధాలు, సబద్ధా లేమిటమ్మా, గొంతులు గోయడానికూ-డా సిద్ధ మౌతారు.

శాంత : నిజమేనయ్యా సచ్చినాళ్ళు. దేనికన్నా తయా రౌతారు, మీరుమాత్రం ఒంటరిగా తిరగబాకం డయ్యా.

నారా : (పుస్తకాలు వెతుకుతూ) సరేగాని అమ్మా, నా పుస్తకం ఒకటి వుండాలి కనబడదేం? ఎర్రట్టది, లావుగా ఉంటుందే, అది.

శాంత : ఆఁ మరిచిపొయ్యా, ఏదోగాని ఒక పుస్తకం యిమ లమ్మ పట్టుకెళ్ళిందిరా? వచ్చినకాడనుంచీ ఆపిల్ల కండ్లన్నీ పుస్తకాలమీదే వుంటాయి.

నారా : (నవ్వుతూ) నీకు రాట్నంమీద ఉన్నట్లు.

శాంత : నా బతుకే చెప్పు. కాకపోతే తల్లిలేదన్నమాటే గాని, ఆ అమ్మాయికేం? మారాజు బిడ్డ.

నారా : మహారాజు బిడ్డలకేం చాలమంది ఉన్నారు. కాని యీ తెలివితేటలు యీ మంచితనం వుండటం మాత్రం అరుదు.

శాంత : మంచితనమేమిట్రా? ఈ రోజుల్లో నాలుగు డబ్బు లుంటే అంత అదిరిపడి చస్తారా? నాకింతుందని ఒక మిడిసిపాటా? ఎచ్చా? ఎంత నిదానం? ఎంత కలుపుగోలుతనం? ఎప్పుడూ అమ్మమ్మా, అమ్మమ్మా అంటూ నోరు కాయగాయనివ్వదురా తల్లి.

నారా : సామాన్యంగా డబ్బుంటే హృదయ ముండదు. హృదయముంటే డబ్బుండదు. ఆ అమ్మాయిలో మంచి లక్షణాలన్నీ వున్నాయి. అదే విశేషం.

శాంత : మంచి లచ్చనాలంటే గేపకం వచ్చింది. మొన్న ఒకమ్మాయి మూణ్ణెల్ల గుడ్డు నెత్తుకొని జానెడుగుడ్డ మొలకు చుట్టుకొని అడుక్కోడాని కొచ్చిందిరా మనింటికి. ఆ బిచ్చపుదాన్ని చూచి ఉసూరుమని యింటికి తీసికెళ్లి కడుపునిండా అన్నంబెట్టి, చీరెయిచ్చి ఒక రూపాయి డబ్బులుకూడా యిచ్చి పంపిందిరా.

నారా : నీకివ్వాళ తెలుసుగాని నాకు మొదటినుంచీ తెలుసు. మేం చదువుకునే రోజుల్లో గూడా పేదాసాదా అంటే యెంతో జాలిపడేది.

శాంత : పాపిట్టిదేవు డేదో వక కొరత పెడతాడు.

నారా : దానికేం జేస్తాంలే ? వాళ్ళ నాన్నగారయినా చాలా ప్రేమగానే చూస్తూవుంటాడు తల్లిలేని లోటు కన పడకుండా.

శాంత : ఆ పాపం నేనెక్కడ ఒడిగట్టుకోనేది. ఏమాటకా మాటే సెప్పాలి. ఆయనగారుకూడా బైటఎన్నిగంతు లేసినా ఆ పిల్లంటే పంచప్రాణాలూ యిడుత్తాడు. (వింగ్‌లో విమలనుజూచి) యిమలమ్మా. రా, అమ్మా. రా. కూచో. నాలుగురోజుల్నుంచి యెక్కడా అజా పజా లేవు.

విమల : ఏదో కొంచెం పనివుండి రాలేకపోయ్యాను. ఇవ్వాళ అప్పుడే రాట్నం బెట్టావే ! భోజనాలయినాయ్ ?

శాంత : ఇయ్యాళ వాయిదాగా అమ్మా. అబ్బాయి వూరి కెల్తాడని పెందలాడే వంటచేశా ? అప్పుడే నాన్నగారి భోజనమయిందీ ?

విమ : ఆ, భోంచేసి బండిమీద గోవిందపురం వెళ్ళారు.

నారా : (పుస్తకం జూస్తూనే) ఎందుకో ఎండలో వెళ్ళారు ?

విమ : ఎందుకా? రావాలిసిన అప్పులూ సప్పులూ ఉంటా యిగా మరి.

నారా : ఓహో!

శాంత : ఏమమ్మా, ఆరోజుకారోజు అట్టా అవుతున్నావేం?

విమ : ఏం? ఎలావున్నాను? బాగానే వున్నాగా?

శాంత : బాగానే వుండాగా అంటావేంటి? అట్టా తెల్లగా పాలిపోతా.

నారా : మనస్సుకేమీ పాలుపోక పాలిపోతుందేమో?

శాంత : సరేగాని యిమల్లా, పెండ్లటగా, ఎప్పుడమ్మా.

విమ : (విసుగ్గా) ఏమిటమ్మమ్మా. ఎప్పుడూ పెండ్లి పెండ్లి, పెండ్లి పెటాకులూ.

శాంత : ఏమోనమ్మా. జమీందారుగారడిగారట. మీ నాయన ఒప్పుకున్నాడట? లోకులనుకుంటున్నారు.

విమ : అడగడానికి యివ్వడానికి యిదేమీ గొడ్లబేరం గాదు. (కష్టంగా) వాడిపేరు నాదగ్గర యెత్తకమ్మమ్మా.

శాంత : పోనీలే, ఆ వూసిప్పుడెందుకులే.

నారా : ఆ పుస్తకం చదవడం పూర్తిఅయిందా?

విమ : అయింది. కాని...

నారా : కాని... ఏదో ధర్మసందేహం కలిగినట్లుందే.

విమ : ధర్మమో, అధర్మమో, సందేహంమాత్రం కలిగింది.

నారా : ఏమిటది?

విమ : "జమీందారీ విధానాన్ని సంస్కరించితే చాలు" అంటాడు గ్రంథకర్త. ఇందులో మీ అభిప్రాయ మేమిటి ?

నారా : అది కేవలం భ్రమ.

విమ : అయితే ఏం జెయ్యాలని.

నారా : దేశం సుభిక్షంగా వుండాలంటే ఆ విధానమే రద్దు కావాలి.

విమ : సంస్కరిస్తే దేశం సుభిక్షంగా వుండదా ?

నారా : అసలు సంస్కరించడమే అసంభవం.

శాంత : ఏమిటమ్మా అది.

విమ : ఈ జమీందారు పద్ధతే వుండగూడ దంటారమ్మమ్మా

శాంత : పోతే బాగానేవుండుగాని, అనాదినుంచీ వచ్చేది యియ్యాల పొమ్మంటే పోతందా ?

నారా : మొదటినుంచివచ్చే ఆచారాలన్నీ తల్లకిందు లవుతు న్నాయని నీవే అంటావుగా. అలాగే యిదీ (విమల వైపు తిరిగి). ఈ విధానం అనాదినుంచీ ఉన్నదం టావా విమలా !

విమ : ఈ ప్రభుత్వమే దీన్ని తెచ్చిపెట్టిందని చిన్నప్పుడే చదివాను.

నారా : ఆ తెచ్చిపెట్టిన ప్రభుత్వంతోపాటు ఈ విధానం కూడా సెలవు తీసుకుంటుంది.

శాంత : అయితే మరి ఆ శ్లోట్లా బతకాలిరా అబ్బాయీ?

నారా : మిగతా అందరిలాగే. చినిగిన పాతపంచను కుడితే ఆ కుట్టుపక్కనే మళ్ళీ పిగులుతుంది. ఎన్నిసార్లు గుట్టినా అలాగే పిగులుతూ ఉంటుంది. (విమలవైపు తిరిగి) ఈ కుళ్ళిపోయిన విదానాన్ని బాగుజేయడం అసంభవం. సంస్కరించి అతుకులు బెట్టి యెంత సరి జేసినా కొత్త చినుగు లుంటూనే ఉంటాయి. గొంగళిలో అన్నందింటూ వెంట్రుక లెందాకా యేరతాం.

విమల : అంతేనంటారా?

(పుల్లయ్య ప్రవేశం)

పుల్ల : నారాయణా, మనకు బయలుదేరే వేళయింది. ఇంకా కూర్చున్నావేం?

నారా : లేదు పుల్లయ్యమామా నీకోసమేయెదురుజూస్తున్నా, వెళ్ళదాం కూర్చో.

(పుల్లయ్యగారు బల్లమీద కూర్చుంటాడు)

నారా : (లేచి, తన చేతిలోవున్న పుస్తకం సంచిలో పెడుతూ,) అమ్మా నాబట్టలేవే?

శాంత : ఇవిగో తెస్తున్నా.

(లోపలికెళ్ళి ఉతికినబట్టలు తెచ్చి సంచిలో పెడుతూ ఉంటుంది)

విమ : అలాగాడెమ్మమ్మా, (శాంతమ్మ చేతిలో బట్టలు తీసికొని సరిగ్గా మడత పెడుతుంది. సంచిలో వున్న పుస్త

కాలు బైటికితీసి ముందు బట్టలూ తర్వాత పుస్తకాలూ బెట్టి శాంతమ్మ కిస్తుంది.)

శాంత : ఏరా నాయనా యివ్వాళేగా తీర్పు. ఏమౌవుతుందో ?

నారా : ఏమో ? ఏమి చెప్పగలం ?

శాంత : పాపమని మనల్ని దగ్గిరకు దీసినందుకు మన పుల్లయ్యకుకూడా కష్టాలు వచ్చినై.

పుల్ల : ఆడికంటే నే సుఖంగా పెరిగానా యేం అక్కయ్యా? ఆడితోపాటు నేనూ మునగానాం తేలానాం. వస్తే యిద్దరం వస్తాం, పోతే యిద్దరం పోతాం.

శాంత : ఏమో నాయనా, మీ యిద్దరూ వుంటేయెప్పుడూ యేదోవకటి చదువుతూ పాడుతూ సందడిగా వుండేవారు. (సంచి నారాయణరావు చేతికిస్తూ) మళ్ళీ మీరు వచ్చిందాకా బిక్కుబిక్కుమంటూ ఒక్కదాన్నేపడి వుండాలి.

విమల : నేనులేనా అమ్మమ్మా, నీకు జత. బిక్కు బిక్కుమంటూ యెందుకు పడుండాలి.

నారా : ఔను, విమల ఉందిగా అమ్మా, నీకు తోడు.

(పుల్లయ్య, నారాయణరావులు లేచి రెండడుగులేస్తారు.)

శాంత : ఆగండయ్యా, (లోపలికెళ్లుతుంది, పుల్లయ్యా, నారాయణరావాగుతారు. ఒక చిన్న మూట దీసి

కొని బైటికొచ్చి) ఇదిగోరా నాయనా (అని చేయి జాచుతుంది)

~~శాంత~~ నారా : (అందుకుంటూ) ఏమిటమ్మా యిది?

(విమల తల్లీ కొడుకులవంక దీనంగా జూస్తూవుంటుంది)

శాంత : ఏమీలేదు నాయనా. నాలుగు బూరెముక్కలు, దారిలో యేటిదగ్గిర చేరి రెండూ తిని, కాసిని నీళ్ళు తాగి పోండి.

నారా : (సంచిలో బెట్టుకుంటూ) రామయ్యా వాళ్ళేరీ పుల్లయ్య మామా!

పుల్ల : చెరువు గట్టుమీద ఉంటాం రమ్మన్నారు.

నారా : సరే. నడవండి. (ఇద్దరూ నాలుగడుగులు ముందు కేస్తారు. విమలా శాంతమ్మలు కూడా రెండడుగులు ముందు కేసి ద్వారంబట్టుకొని దీనంగా చూస్తూ నుంచుంటారు.)

నారా : (వెనక్కు తిరిగి) ఉండండి వస్తాం.

శాంత : నాయనా పుల్లయ్యా, ఇంకా చిన్నతనం. ఆడసలే మొండి ధైర్యం జేత్తాడు. పొద్దుగూకిన తరవాత రావాకండయ్యా.

పుల్ల : అల్లాగే అక్కయ్యా. మేమంతా లేమూ. (ఇద్దరూ వెళ్ళిపోతారు)

(విమలా శాంతమ్మలు అలాగే నుంచొని వుంటారు.)

—తెర—

# 9

## దివాణం :

[చక్రధర్రావు - రామ్ విస్కీ తాగుతూ వుంటారు]

చక్ర : తాగి తందనాలాడతానట. ఎదవ; నాసొమ్ము నేను తాగుతాను. తలకు జోసుకుంటాను. వీడమ్మ మొగుడిసొమ్మా, నన్ను దేవు డిలా పుట్టించాడు.

రామ్ : (మరల తాగును) ఎద్దుముడ్డి పొడుచుకునే ఆగబ్బి ళాలకేం తెలుసు దొరగారి దర్జా. అసలు మనిషై పుట్టి మచ్చుకు మరచెంబయినా తాగలేని సన్నాసిని అచ్చంగా చచ్చు వెధవల్లో జమ కట్టాలిసిందే? (తాగుతూ వుంటాడు.)

చక్ర : బలేమాట జెప్పావు. బుర్రఅంటే నీది బుర్ర. బృహస్పతికి కూడా లేదు.

రామ్ : సుర తాగితే దొరఅవుతాడు. దేవతలదొర దేవేంద్రుడు. ఎట్టా అయ్యాడు అందరికంటె అదనంగా తాగితేనే. తియ్యమనండి శాస్త్రిలు.

"సురతాగెను దేవేంద్రుడు
సురతాగియే కాళిదాసు శూరుండయ్యెన్
సురయే సాక్షాదమృతము
సురతాగనివాడు భువిని సూకరమేరా"-

మోహన్ : (ప్రవేశిస్తూ) సందుదొరికితే అందలమెక్కుతా వురా సన్నాసి. ఏముందిరా శాస్త్రాల్లో పెద్ద తెలిసినట్టుగా. రంభ లేనిదే రాజెట్లా అయ్యాడురా?

చక్ర : హలో, బ్రదర్, మోహన్. వచ్చావంటూరా? వచ్చావా? తెచ్చావా?

మోహన్ : ఓ, యస్.

రామ్ : అచ్చా రేబచ్చా. ఎక్కడ దించావురా రంభని (విస్కీగ్లాసు మోహన్ కి అందిస్తాడు)

మోహన్ : ఎక్కడేమిట్రా? రాజుగారి రంగుల మేడలో.

చక్ర : మోహన్, బలేవాడవురా. గుండెలు దీసిన బంటువి. నీకు మన యెస్టేటులో దివాన్ గిరీ యేస్తాను.

మోహన్ : హి. హి. హి. బతికుండగా అనుభవించాలి రంభని. చచ్చాక ఏముందిరా శ్రాద్ధం.

చక్ర : పరస్త్రీని అంటుకుంటే పాపమంట. వేదాంతం? చేతగాని వేదాంతం?

రామ్ : అసలు వేదాంతం ఆ యెదవలకేం తెలుసు? (మోహన్ వైపు చేయిజూపి) ఈ యెదవలకేం తెలుసు?

"దురితము సుకృతముగానీ
అరయగ జీవునకెగాని వ్యక్తులకగునే?

నరదేహము జడవస్తువు
గురుతెరిగిన వారికిదియె - తిరుమంత్రమగురా
గురుశిష్యులకూ యిదే - పరమార్థమగురా"

చక్ర : ఓరీ నీవేదాంతం మండ. నీ కన్నిట్లోనూ అనుభవ ముందిరా. అరే మోహన్. నీకుగాదురా దివాన్‌గిరీ. రామ్ కిచ్చాను.

(ముగ్గురు నవ్వుతారు)

రామ్ : (దివానులాగా ఠీకుగా నుంచొని) అరే మోహన్, నీ వెళ్లి వంటవాణ్ని పలావ్‌కు కావలసిన సామాను తోసహా వెంటనే రంగుల మేడకు పంపించు. ఊఁ, మంచి సిల్కుచీరెలు, ఫష్టిలాస్ సెంట్లు వైట్‌హార్సు నాలుగు బాటిల్సు...... అంతా సిద్ధంజేయించు పో. ఇది దివాన్‌గారి ఆర్డర్ - జాగ్రత్త.

మోహన్ : (నౌకరులాగా భయభక్తుల నభినయిస్తూ దణ్ణం బెట్టి) చిత్తం చిత్తం. (నవ్వి వెళ్ళిపోతాడు.)

చక్ర : దివానంటే అలావుండాలి. నీ తలకాయలో తెలివి చెవులగుండా కొద్దిగా బైటికి పోతోందిగాని, లేక పోతేనా? తిమ్మరుసు నీకు బలాదూర్ (నవ్వుతూ యిద్దరు సిగరెట్లు వెలిగిస్తారు).

(వెంకన్న ప్రవేశించి దణ్ణంబెట్టి నుంచుంటాడు)

రాం : పల్లా బాగుందిరా?

వెంక : (చేతులు గట్టిగా కొని రెండడుగులు వెనక్కేసి భయంతో) పండగగాదూ; కాత్తి అలెస్సమయిం దండీ.

చక్ర : పండగయితే......

వెంక : పండగ పండక్కీ అచ్చయ్యాగారింటికాడ ఒకపూట అన్నమెడతారండి. ఇవ్వాళ బుల్లెమ్మగారు కాత్తి అలెస్సంగా బెట్టిందండి.

రామ్ : ఎవర్రా బుల్లెమ్మగారు ?

వెంక : (వినపడక చెవియొగ్గి నుంచుంటాడు)

రామ్ : (బిగ్గరగా) అరే యెవర్రా బుల్లెమ్మగారు ?

వెంక : (ముసిముసి నవ్వులతో) అచ్చయ్యగా రమ్మాయండి. సిన్న దొరసానిగారు.

చక్ర : అప్పుడే చిన్నదొరసాన్ని జేశావు ?

రామ్ : మోహన్ సాన్నిదెస్తే వెంకన్న దొరసాన్ని దెచ్చాడు. బాబుగారి పేరుచెప్పితే వొర్రు.

చక్ర : సరేగాని వెంకన్నా, ఆ అమ్మాయి అచ్చయ్యగారి లాగే వుంటుందా ?

వెంక : (చేతులు నలుపుకుంటూ సంతోషంగా) మాపెద్ద చెయ్యండి

చక్ర : ఛీ. చెవిటి వెధవా.

(వెంకన్న వులిక్కి పడతాడు ఇద్దరూ నవ్వుతారు. జమీందారు వెంకన్నను చేతితో దగ్గరకు పిల్చి)

చక్ర : అరే. ఆమెగారు అచ్చియ్యగారిలాగా వుంటుందా ?

వెంక : హి హి హీ, అచ్చియ్యగారికి మల్లేనా ? ఆయనకంటే నేనోకొన్న మెరుగు గాదండి? ఆ దొరసానెక్కడండి? సబ్బు తల్లే. సుక్కల్లో శంద్రుడు. కనోంకా, కాలోంకా. ? పచ్చగా దబ్బ పండులాంటి వన్నె. చారెడు చారెడు కళ్ళు. నాగుబాములాంటి జడ యెట్టా వుంటుంది ! దేవగన్నిక.

రాం : ఆఁ ఆఁ

చక్ర : అంత బాగా వుంటుందా యేమిట్రా ఆమెగారు ?

రాం : చెప్పడం మాత్రం చమత్కారంగా వుంది.

వెంక : ఏమిటండీ అట్టా అంటారు ? తప్పి పుట్టిందిగాని అస లేదొరలింట్లోనో పుట్టాలిసింది. బుద్దేమి బుద్ధి వరాల బుద్ది. (చేయ జూపెడుతూ) చారెడు నేయి బోసింది తల్లి బుట్టెడు పూలెట్టుకోని వనలచ్మి

(ఇద్దరూ నవ్వుతారు)

చక్ర : ఇంతనేయి బోస్తే మొద్దులాగా, తినిరావడమేనా వెధవా. ఒకనాడిన్ని పూలు తీసికెళ్ళి యివ్వరాదూ.

రాం : (లీవిగా) అరే మనతోటలో వున్నాయిగా తీసికెళ్ళివ్వు.

వెంకన్న : (సంతోషంగా) సిత్తం సిత్తం. అట్టాగే పట్టుకెల్తా నండి. (వెళ్ళిపోవును)

చక్ర : వెంకన్నగాడుకూడా ఒక కవై పోయాడే ?

రామ్ : ఆడికి చదువే రాదుగాని అదేవుంటే ఆస్థాన పండితుడుగా అప్పాయింటు చేయక పోయారూ ఈ దివాన్ గారు. సరేగాని అచ్చయ్యగారికి మొగపిల్లలు లేరా అండి ?

నాగేం : (ప్రవేశిస్తూ) లేరు. ఒక్కతే ఆడపిల్ల.

రామ్ : చాలా బ్యూటిఫుల్‌గా వుంటుందటగా ఆమెగారు ?

నాగేం : అందం సరే. పాట !

చక్ర : సంగీతజ్ఞానం కూడా వుందా యేమోయ్ !

నాగేం : అంత చక్కనిపాట, నే నెప్పుడూ వినలేదు. మీరు కూడా విని ఉండరనుకుంటాను.

రామ్ : అయితే రాగం ఆలాపిస్తే రాళ్లు గరగాలిసిందే ?

చక్ర : ఇంగ్లీషుకూడా చదువుకున్నదనుకుంటాను.

నాగేం : ఇంగ్లీషేనా ? ఆమెగారి తల్లి ప్రయివేటు మాష్టర్ని బెట్టి హిందీకూడా చెప్పించింది.

రామ్ : అయితే అన్నిట్లోనూ మన నాగాని కాగిన ఆణిముత్యమన్నమాట.

చక్ర : అంత తెలివిగలావిడ గాబట్టే తండ్రితో ఆ విధంగా మాట్లాడగలుగుతుంది.

నాగేం : ఏం మాట్లాడినా తమకెదిరించి ఎక్కడికి బోతుంది లెండి? అన్నివిధాల ఆ అమ్మాయే మీకు తగింది.

రామ్ : అచ్ఛా. కొద్దిరోజుల్లో మళ్ళీ మాకొక డిన్నరు తగిలిందన్నమాట.

నాగేం : ఇంకా "అన్నమాట" ఏమిటి? ఆమెగారిని మన దొరగారి పక్కన కూర్చోబెట్టకుండా యీ నాగేంద్రం నిద్రపోతాడా? (జమీందారువైపు జూచి) ఆ స్త్రీమాత్రం? నిలవడబ్బుతోనే ఒక వూరు కొనే యొచ్చు.

చక్ర : అందుకేగాదటోయ్, యిన్ని తంటాలు పడేది? వెంకన్న చెప్పినట్లు ఒక్క వనలక్ష్మిగాదు, ధనలక్ష్మి కూడా.

రామ్ : బలేప్లాన్. (చిటికేస్తూ) దెబ్బకి రెండు పిట్టలు.

నాగేం : కోర్టు టైముకందుకోవాలి. వెళ్ళతాను.

చక్ర : ఓహో! యివ్వాళేగా వాయిదా?

నాగేం : ఇవ్వాళతో మనకని విరగడై పోతుంది.

రామ్ : దేవయ్యలిద్దరూ దేవతాపులుసు రుచిచూస్తారన్నమాట.

చక్ర : (వికటంగా నవ్వుతూ) రెండోకంటికి తెలియకుండా ఎంత జాగ్రత్తగా చిచ్చుబెట్టాడోయ్ మన పిల్లి భీముడు.

నాగేం : అమ్మా! ఇలాటి పనులు జేయడానికి నాకు అందె వేసిన చెయ్యిండోయ్.

రామ్ : వాడికి తర్ఫీదెవరిదీ. దివాన్‌జీగారిది.

చక్ర : ఇంతకూ శిక్ష పడేనా?

నాగేం : నేను కేసు నడపడం. తమరు ఆఫీసర్ని కలుసుకోవడం... ...

రామ్ : నేను సాక్ష్యం తయారు జేయడం, శిక్ష పడకపోవడమూనా?

చక్ర : ఎంత ఖర్చయినాసరే వాణ్ని గోదావరి నీళ్ళు తాగించాలి.

నాగేం : పాపం! వాడొక్కడే తాగుతాడా? తన స్నేహితుడు పుల్లయ్యను వదిలిపెట్టి!

చక్ర : నే నింట్లోనుంచి వెళ్లగొట్టడం, మొనగాడులా వాణ్ణి తన యింట్లో చేరనివ్వడమూ!

రామ్ : తమ తడఖా ఆ బ్రూట్‌కేం తెలుసులెండీ.

చక్ర : ఇప్పుడేడుస్తూవుండాలి- ఎందుకు జేరనిచ్చానా వీణ్ణని.

రామ్ : ఏడవాలిసిందే. వెర్రిమొగాలందరూ యీ దెబ్బతో కాళ్ళబేరానికి రావాలిసిందే.

నాగేం : వాడి తిక్క బాగానే కుదిరిందిగానీ, దున్నపోతు ల్లాగా తెగబలసి వాళ్లెయ్యమన్న గంతల్లా వేసేరకం యింకా లేకపోలేదు.

రామ్ : చూస్తారేం? సన్నాసుల్ని సున్నపుగానుగ కట్టి తిప్పక?

నాగేం : వాళ్ళు మళ్ళీ తిరిగి వచ్చేలోపల వీళ్ళభరతంకూడా పట్టాలి. అప్పుడుగాని కుక్కిన పేనుల్లాగా......

రామ్ : కిరుక్కుమనకుండా పడివుండరు.

చక్ర : ఒక్కొక్కణ్ని పరవదోలి వేటాడాలి.

నాగేం : తమరి సెలవే గావాలిగాని......

చక్ర : ఇంకా నా సెలవేమిటి? నీయిష్టంవచ్చినట్లు చేశేయ్, నీకత్తి కెదురులేదు పో.

రామ్ : ఇక జూపవయ్యా నీ తమాషా.

చక్ర : ఒకవేళ బ్రతికి బైటపడ్డా. వాడి వూరూ పేరూ తల్చేవా డుండగూడదు. తెలిసిందా?

నాగేం : చిత్తం, టైమయింది వెళ్ళివస్తాను.

చక్ర : (రిస్టువాచి చూచి) అరే! టైమయిందే. పెద్దగుర్రా న్నెసుకెళ్లు.

(నాగేంద్రం దణ్ణంపెట్టి వెళ్ళిపోతాడు)

వెంకన్న : (ప్రవేశించి) అచ్చయ్యగారొస్తున్నారండి బాబు.

(వెంటనే రామ్ గ్లాసులు విస్కీ–బాటిల్సు బల్లకింద బెట్టేస్తాడు జమీందారు ఠీవిగా గూర్చుంటాడు - వెంకన్న బైటికెళ్ళిపోతాడు)

(అచ్చయ్యగారి ప్రవేశం)

రామ్ : ఓ, తాతగారా, గుడ్ మార్నింగ్, దయచేయండి.

చక్ర : రాండి, రాండి. కూర్చోండి (కుర్చీ జూపుతాడు)

(ఈ వాలకమంతా జూచి చీదరించుకుంటూ అచ్చయ్యగారు కూర్చుంటాడు)

చక్ర : అచ్చయ్యగారూ, ఇవ్వాళతో మీపీడా, మాపీడా, అందరిపీడా వదిలినట్లే.

అచ్చ : తమరు తల్చుకుంటే కానిపని ఒకటుందా?

రామ్ : మూతీ గడ్డం నెరసినా ముచ్చటగా సెలవిచ్చారు.

అచ్చ : (అసహ్యభావం బైటికి గన్పడకుండా ఆపుజేసుకొని) కాని పుల్లయ్యను కూడా కేసులో పెట్టడంవల్ల - ఎంత లేదన్నా వాళ్ళదీ పదిమంది గల కుటుంబమాం? అయినావాళ్ళు గాబట్టి అంతా తెగబడ్డారు. ఇదివరకు అటూ యిటూ గాకుండా ఊగిసలాడుతున్న రకం అంతా అటే మొగ్గారు.

చక్ర : మొగ్గుతారు. మొగ్గుతారు, ఎందుకు మొగ్గరు? చూస్తారుగా వాళ్ళగతి. ఒకొక్కడు చిన్నప్పుడు తాగిన దొండాకు పసరు కక్కాలి.

రామ్ : అంతగా గాకపోతే కొంచెం భేదిమందు తగిలిస్తే సరి (వెకిలిగా నవ్వుతాడు)

అచ్చ : (గంభీరంగా) కాని పరువుమర్యాదలు నిలబెట్టుకునే విషయంలో మాత్రం పరాకుగా వుండగూడదు. వస్తాను. (కుర్చీలోనుంచి లేస్తాడు)

చక్ర : అచ్చయ్యగారూ, మన వ్యవహారమెంత వరకు వచ్చిందండీ?

అచ్చ : (వ్యంగ్యంగా) మన వ్యవహారం త్వరలోనే తేలిపోయ్యేటట్లు కనపడుతూంది. కాకపోతే పదిరోజులటో యిటో.

చక్ర : సరే, కానివ్వండి.

అచ్చ : వస్తాను, సెలవు. (వెళ్లిపోవును)

(జమీందారు ఆలోచిస్తూ అచ్చయ్యగారివైపు తదేకదృష్టితో చూస్తూ వుంటాడు. రామ్ జమీందారువైపు ఎగాదిగా జూస్తూవుంటాడు.)

# 10

బెజవాడ రైల్వేస్టేషను సమీపంలో

(నారాయణరావు పుల్లయ్యగార్ల యిరువురి చేతులు కలిసి సంకెళ్ళు వేసి యిరువైపులా పోలీసులు నడుస్తూ వుంటారు. ఎదురుగా తల్లీ, కోటయ్య, వీరయ్య మరికొందరు కలిసి ప్రవేశిస్తారు. పుల్లయ్యా నారాయణరావుల్ని చూడగానే తల్లి దుఃఖంతో ఆవురుమని నారాయణరావుని కౌగిలించుకుంటుంది. మిగతా వారంతా విచారంగా నుంచుంటారు.)

పోలీసు : ముసలమ్మగారూ, ఎడంగా వుండండి. అలా మీద బడకూడదు.

శాంత : (ఏడుస్తూ) అయ్యో నాయనా!

నారా : అమ్మా. తెలిసినదానవు నీవే యిలా విచారపడితే యెలా? మూణ్ణెల్లూ ఒక తృటిలో గడిపిరామూ. ఏడవకమ్మా. ఇది విచారించవలసిన సమయం కాదు.

శాంత : బాబూ, యీ మూడురోజులూ మూడు యుగాలుగా వుంది. మూణ్ణెల్లు ఎట్టా పొద్దుగూకను, ఎట్టా తెల్లారునూ. (పుల్లయ్యా నారాయణరావుల సంకెళ్ళ చేతుల పైకెత్తి) నాయనలారా, మీ చేతులకా యీ సంకెళ్ళు. ఎవరికొంపలు తీశారనీ. ఈ చేతులతో యెవరి నోటికాడ కూడుపడదోశారనీ ?

నారా : ఒకళ్ళ నోటికాడ కూడు పడదోసినందుకు గాదు ! ప్రజల రక్తమాంసాలు పీల్చి పిప్పిచేసి కట్టుగుడ్డలతో నిలబెడుతున్న జమీందార్లను, పెట్టుబడిదార్లను, యిది మీకు తగదయ్యా అని చెప్పినందుకమ్మా యీ సంకెళ్ళు. ఇదే మహా అపరాధమయితే, ఇదే మహా ఘోరకృత్య మయితే, యిందుకొరకు యీ సంకెళ్లనే కాదు ఉరికంబాలసైతం ఎంతో ఆనందంగా కౌగ లించుకోవడానికి వెనుదీయం. మీ శ్రమఫలితమే నన్నిట్టి వీరునిగా తయారుచేసింది. నీ కొడుకునని. చెప్పుకోడానికి నేనెంతో గర్వపడుతున్నాను తల్లీ.

పుల్ల : అక్కా. ఈపాడుపొట్ట పోషించుకోడానికి మేమెవడి కొంపా తగలెట్టలేదు: ఎవడి కొంపకీ కన్నం వెయ్య లేదు. పదిమందికోసం జైలుకు పోతున్నాం. అందు కోసం యీ సంకెళ్ళు వేయించుకొన్నాం. ఇందులో మాకొచ్చిన సిగ్గూ, నామర్దా యేమీలేదు. మనిషై పుట్టి అట్టాంటి పనులుజేసే సన్నాసి యెవడైనా సిగ్గు పడాలి. యీ సంకెళ్ళన్నా జైలన్నా మాకేం భయం లేదు. మమ్ముల సంతోషంగా దీవించిపంపు. అదే మాకు అండ.

పోలీ : ఏమిటయ్యా సోది. పదండయ్యా పదండి (అని నెట్ట బోవును)

కోట : ఏమిటయ్యా అట్టా నెట్టేత్తారు. కాత్తి ఆగండయ్యా.

నారా : అన్నా తొందరపడకు. వాళ్ళదేముంది పాపం. అది వాళ్ళ డ్యూటీ. తప్పదు, కోటయ్యన్నా. మన కాసిం ఏడీ ?

వీర : అసలే జబ్బుగా వున్నాడురా. మీకు సిచ్చబడ్డదని విన్నాక బొత్తిగా మంచం బట్టిపోయాడు.

నారా ? అయ్యో పాపం.

కోట : అయినవాళ్లు మీరిద్దరూ యెల్లిపోతే యిక మాగతేం గావాలి ?

పోలీ : ఏమిటయ్యా, అంతూ పంతూ లేని సోది. చాల్లేపదండి.

శాంత : అయ్యో బాబూ. పోతున్నారా ! (అని యేడుస్తుంది)

నారా : అమ్మా ధైర్యంగా వుండాలిగాని నీవిలా గుండె చెడితే ఎలా ?

శాంత : ఎంతగుండె రాయిచేసుకొందా మనుకొన్నా బిడ్డల గన్నతల్లి మనసు ఎట్టా నిలుత్తుందిరా !

నారా : అమ్మా ఒక్కసారి పుల్లయ్యమామ సంగతి చూడు. చదువు లేకపోయినా ఎంత త్యాగం చేశాడో! జమీందారుని లెక్క చేయకుండా మన కాశ్రయమిచ్చి నాతోపాటు జైలుకు కూడా సిద్ధమయ్యాడు. కోటయ్య, వీరయ్య, కాసిం గార్లంతా మనతోపాటు

నానా కష్టాలు పడటల్లా? వీరందరూ నీ బిడ్డలు కాదూ? వీరందరి కష్టాలూ నీ కష్టాలుగావూ? వారి కోసం మనం, మనకోసం వారూ ఆహుతి కాకపోతే మరెవ్వరౌతారు? అమ్మా నేనొక్కణ్ణి లేనని నీకు విచారమెందుకు? ఈ ప్రజలంతా నీ బిడ్డలు. ప్రజల కష్టమే నీ కష్టం. ప్రజల సుఖమే నీసుఖం. రేపోమాపో మీరుకూడా జైలుకు రావాలసి వస్తుంది? లాఠీదెబ్బ లకు గురికావాలసి వస్తుంది. ఎన్నికష్టాలు వచ్చినా, యిది మనదేశం. వీరు మన ప్రజలు అనే సత్యాన్ని మాత్రం మరచిపోవద్దు. ఈ అగ్నిపరీక్షకు మీరంతా నిలబడి రెట్టింపుత్సాహంతో పనిచెయ్యాలి. నేను లేని కొరత తల్లివైన నీవు తీర్చాలి. ధైర్యంగా నిలవండి. దురాగతాల్ని యెదుర్కోండి.

గీ॥ రైతు కార్మికరాజ్య నిర్మాణమునకు
ప్రాణముల్ సైతమున్ సమర్పణము సేయు
అసమసాహస భరతయోధాగ్రసరుల
నినుప సంకెళ్ళు చెరసాల లేమిసేయు?

(పోలీసులు తోసుకెళ్లుతూ వుంటారు, పుల్లయ్యా, నారాయణ రావులు శాల్యూట్ చేస్తూ వెళ్ళిపోతారు. అందరూ నిశ్చేష్టులై ప్రతిమ ల్లాగా నిలబడతారు:)

# 11

## పుల్లయ్యగారిల్లు

[శాంతమ్మ విచారంగా కూర్చొనివుంటుంది. విమల ప్రవేశం.]

విమల : ఏమిటమ్మమ్మా, అలా గూర్చున్నావు? పొయ్యి అయినా రాజెయ్యలేదేం? ఇంతెందెక్కినా?

శాంత : నా కూటికేం తొందరవచ్చినదిలే అమ్మా.

విమల : అదేమిటమ్మా, అలా అంటావు?

శాంత : ఒక్కగానొకసన్నాసి, అక్కడ జైల్లోబడి అఘో రిత్తావుంటే నాకేం కూడు సయిత్తుందమ్మా!

విమల : అదేమిటమ్మమ్మా, అలా అంటావు, అన్నీ తెలిసిన దానివి యీ సంగతి తెలిస్తే జైల్లో ఆయన ఎంత బాధపడతాడో కాస్త ఆలోచించు.

శాంత : ఆడెక్కడెక్కడ తిరిగినా ఏదో ఒకయేల కింటి కొచ్చి 'అమ్మా, అని నోటూర పిలిస్తే అన్ని కష్టాలు మరిచిపొయ్యేదాన్ని. ఈ నాల్గురోజుల నుంచీ యేదో అడవిలో బడ్డట్టుంది.

విమల : నీవే యిలా గుండెచెదరి కూర్చుంటే యిక పుల్లయ్య బాబాయిగారింట్లో యెంత హడలిపోతారో చూడు.

శాంత : అవునమ్మా, ఆళ్ళ యింట్లో పిల్లా జల్లా అంతా చీకు రామాయణంగావుంది. కూడూలేదు, కుమ్మూ లేదు. ఆ కడసారోడెప్పుడూ బాబు పక్కలోనే పడి వుండేవాడు. రెండురోజులనుంచి జ్వరం తగుల్తాంది. మనాది బెట్టుకొన్నాడో యేమో సన్నాసి.

విమల : పాపం జ్వరం తగులుతుందా కుర్రాడికి? ఇలాంటప్పుడు మనం చెయ్యాలిసిన పనేమిటి? ఇలా విచారంగా కూర్చోవడమేనా? ఆ పిల్లాడికి మందూ మాకూ చూడాల్సినపని మనదిగాదూ? నారాయణరావు వెళ్లేటప్పుడు మనం యేమనిచెప్పాం? మన శక్తి వంచనలేకుండా మనకు చేతైన పనేదో చేస్తామనలా?

శాంత : అన్నామమ్మా అన్నాం. కన్నకడుపు కనుక అట్టా అనిపిత్తాంది.

విమల : నిజమే అనుకో అమ్మమ్మా, ఎందరు తల్లులు తమ బిడ్డల్ని దేశాని కర్పించటంలేదూ? నీవుకూడా అలాంటి వీరమాత వనిపించుకోవాలి గాని, యిలా పిరికిపారితే యెలా? మనమెంత గట్టిగా పనిజేస్తే వాళ్ళకంత సతోషంగా వుంటుంది. అంత తొందరగా బయటికొస్తారు.

శాంత : (లేచి మంచం పైకెత్తుతూ) చేయాల్సిందేమరి... నాబోటి ముసలిది యేమిజేత్తంది. ఊరు పొమ్మంటా వుంది. కాడు రమ్మంటావుంది.

విమల : అదే పొరపాటు. మనం చెయ్యాలంటే సాధ్యంకాని పని అంటూ ఒకటుందా? ఎవరికి తగిన పని వారికే వుంటుంది. నిజంగా నీవే నడుంగట్టి నిలిస్తే కానిపనేమిటి– నీకున్న మంచిపేరుకి?

శాంత : సరే ఏంజెయ్యాలి సెప్పమ్మా సేత్తాను.

విమల : అది నీలాంటితల్లి అనవలసినమాట. (వీరయ్యా కోటయ్యల ప్రవేశం)

శాంత : ఏమినాయనా, ఏమిటి కబుర్లు?

వీర : ఏముంది పిన్నీ దినగండం నూరేళ్లాయస్సు.

కోట : అయినా వాళ్లిద్దరూ జైల్లోపడ్డారు. వీళ్ళని పట్ట పగ్గాలు లేకుండావున్నాయి.

విమల : ఆదిలో అలాగేవుంటుంది. కొంచెం ఓపికతో యెదురొడ్డంటే యీ కారుమబ్బులన్నీ అవే విడిపోతాయి.

వీర : ఏం విడిపోతాయో, ముందు సచ్చేరోజొచ్చింది. ఉన్న కొంౘెడ కాస్తి వూడిపోయేట్టుంది.

శాంత : అదేమిటి నాయనా.

కోట : ఏముంది పిన్నీ, ఆయాళ తగాదే.

విమల : ఎప్పటి తగాదా అండీ కోటయ్యగారూ?

కోట : అదే, శిస్తుతగాదా. మొన్న శిస్తుగట్టాని కెళ్ళితే నిరుడు కట్టింది మింగి, రెండేండ్లదీ మళ్ళీ గట్టమ న్నాడు తానేదారు. దానిమీద కీచులాడాం.

విమల : అవును. ఆ సంగతి నాకూ తెలుసు. నాన్నగారు జెప్పారు.

వీర : అవునమ్మా. అప్పుడు నాన్నగారుకూడా వున్నారు.

కోట : దానికే యిప్పుడు జప్తుపెట్టి వేలం వేస్తున్నాడు.

శాంత : అయ్యో నాయనా, ఎన్నితిప్ప లొచ్చాయిరా!

వీర : ఆ గడ్డకాస్తా పోతే ఎట్టా బతుకుతాడో! నలుగురు పిల్లలూ ఆడూ—

కోట : నా కాలూచెయ్యి సల్లగావుంటే నాకు కరువేమిట్రా? బతకలేనని చింత నాకెప్పుడూలేదు. ఆళ్ళపొంగు జూస్తే తలకాయ నేలకేసి కొట్టినట్టుంది. అందుకు జస్తె న్నాను.

శాంత : పొంగుతాడు పొంగుతాడు. పొంగినపాలు పొయ్యి పాలే లేరా?

విమల : కోటయ్యగారన్నట్లు కష్టజీవులకు రెక్కలే ఆధారం.

వీర : ఆ రెక్కలకట్టం మాత్రం యెక్కడదక్కనిత్తన్నా డమ్మా. ఆరుగాలం కట్టపడ్డా శమఅంతా అడవి

పాలైంది. ఒక కుంట మిరపతోటేసుకుంటే ఆనోపంగా పూతపిందెమీాదుండగా పీకించేశాడు.

కోట : (పండ్లు నూరుతూ) ఎన్నాళ్ళు పీకిస్తాడు? నూరుగొడ్లు తిన్న రాబందు ఒక్కగాలివానకు పడదంటలేరా?

వీర : ఆరి నీయైరిగాల. ఏం పడుతుందిరా. పదిమంది కలిసి వస్తేనా? ఒకడేటికీ ఒకడు కోటికీ లాగుతావుంటే ఎట్టాతగలడ్తుందిరా? సంగం సంగం అంటా మన మిట్టా మాడిచత్తావుంటిం. ఆడిచుట్టూ చేరినోళ్ళపని మూాడు పువ్వులూ ఆరు కాయలుగావుండె.

విమల : ఎందుకుండదు? నీతీ జాతీ లేకుండా అభిమానాన్ని చంపుకోని అడ్డమైనగడ్డీ గరుస్తుంటే.

శాంత : దినం గడిచింది లెక్కగాదు. తనువుగడిచింది లెక్క.

(ఉద్రేకంగా కాసిం ప్రవేశం)

కోట : ఏమిటికాసిం హడావుడి ?

కాసిం : హేమ్మిసచ్చింది హూాక్టీదఫా బడితాపూజాసేస్తేగాని బుద్దిరాదు.

వీర : ఓరి నీపాపం పాడుగాను? జరిగినదేమిటో చెప్పాముందు.

కాసిం : హేమ్మీావుంది. కుళ్లూబోతు హేడ్పు హేడ్చార్.

శాంత : ఏం జరిగింది నాయనా?

కాసిం : నాదీ గొడ్డుల్ నీళ్ళా తాగేదాన్కి చెర్వుకీపోతే దొడ్కి తోలించాడ్.

విమల : చెరువులో నీళ్ళు తాగడానికికూడా నోచుకోలేదన్న మాట మనగొడ్లు.

వీర : కొంపాగోడీ పీక్కొని వలసబోయే రోజొచ్చింది.

కోట : పుట్టిపెరిగిన గడ్డ వదలిపెట్టి పెళ్ళాం బిడ్డల్ని వేసుకొని పోతాడట ఎక్కడకో, ఇక్కడ మిడకడం చేతకాక.

కాసిం : పోతాడ్ హడ్వేలోకి.

విమల : ఎక్కడికిబోతారు? ఈ కష్టాలెక్కడికెళ్ళినా తప్పవు. వెంటాడి తీసుతాయి. ఉన్న నలుగురూ ధైర్యంగా ఒక్కమాటమీద నిలబడి ఎదుర్కోవాలి. నారాయణ పుల్లయ్యగార్లెవరికోసం జైలుకెళ్ళారు? పుల్లయ్య గారింట్లో పిల్లా జెల్లా యెన్ని అవస్థలు పడిపోతున్నారు? నారాయణరావున్ననాళ్ళూ చేయగలిగారా యీ పిచ్చిపనులు.

వీర : ఆడుంటే యిన్ని తిప్పలెందుకొచ్చేయి?

విమల : ఇవ్వాళ నారాయణరావు లేడు లేడనుకొంటే యేమిటి ప్రయోజనం? మీలో ఒక్కొక్కరు ఒక్కొక్క నారాయణరావై పోవాలి. అప్పుడే నారాయణరావు మావాడని చెప్పుకునే అర్హత కలిగి వుంటాం.

వీర : మీమాట వింటావుంటే అదీ నిజమేరా అనిపిత్తంది. అవతలకు బోతే మళ్ళీ అంతా అయోమయం.

శాంత : ఏమిటా అయోమయం? నాకంటె అయోమయమా? ఉన్న ఒక్కొడుకూ జైల్లో బడ్డాడు. తల దాచుకోడానికి కొంపకూడా లేకుండా జమిందారు లాక్కున్నాడు. గిద్దడు గింజలు కొంపకొచ్చేదారి అగపడదు. అరవైయేండ్ల ముసల ముండను. నారెక్క లెట్టుకొని నేనుబతకటల్లా? నామాత్రం ధైర్యంలేదూ? మిరపతోటలు పీకేత్తేయేం? యేంజేత్తేయేం? దేవుడిచ్చిన రెక్కలు తీసుకపోతాడా? మొగాళ్ళే! ఒక అయ్యదగ్గర కూలి జేసుకొనైనా రోజుకు పావలా డబ్బులు తెచ్చుకొని పెళ్ళాంబిడ్డల్ని బతికించుకోవచ్చే! మనూళ్ళో అందరికి భూములే వున్నయ్యా? లేని వాళ్ళెంతమంది ఒతకటల్లేమూ? ఎందుకీ పిరికితనం? మీ నలుగురూ ఒక మాటమీద నిలవండి. నేను ముందు నుంచుంటాను. సత్తే ముందే సత్తాను.

వీర : (ఉద్రేకంతో) ఇంత బతుకు బతికి ఆడదాన్ని. ముసలిదాన్ని నిన్ను ముందు బెడతామా? చూతాం ఏం చేత్తాడో.

కాసిం : అరే మీరే హట్టావుండాలిగాని మా కొంపల్లోవున్న పదిమందీ సావుకీ బతుక్కీ మీతోపాటు తయార్.

కోట : చావుకి రెండు చావులా. ఏంచెయ్యాలో చెప్పమ్మా. నేనూ ముందుండేది.

విమల: చేయాలిసింది దే. అందరూ ఒక్కమాటమీదవుండాలి. వాళ్ళేపిచ్చిపనులు చేసినా అందరూ ఒక్కుమ్మడిగా ఎదుర్కోవాలి. మిగతా కార్యక్రమం తర్వాతచూచుకొందాం. ముందు కోటయ్యగారి పొలం వేలం గాకుండా చూడాలి. ఆ డబ్బేదో రేపే కట్టివేదాం. సంఘబలాన్నెవరూ అడ్డగించలేరు. ఒక అభ్యుదయ కవి జెప్పినట్లు

"శ్రామికావళి తమ సంఘశక్తి యెరిగి
నడుము బిగియించి నిల్చి ముందడుగు వేయ
మృత్యుకోరలనేన్ పెకలించివైచు
సంఘబలమున కేది అసాధ్యమిలను ?"

కాసిం : బోలో రైతుసంఘానికీ జై

(తెర పడును)

# 12

## దివాణం

(జమీందారు కుర్చీలో కూర్చొని సిగరెట్టు కాలుస్తూ వుంటాడు. పక్క కుర్చీలో నాగేంద్రం కూర్చొని వుంటాడు)

చక్ర : నాతో వైరమంటే యేమో అనుకున్నారు ? రోగం వదిలింది.

నాగేం : ఆహా. మొనగాళ్ళమని తలకాయ కొంచెం బైటి కెళ్ళబెట్టిన వాళ్ళందరికీ తగిన ప్రాయశ్చిత్తం జరిగింది లెండి. కాని కాసింగాడున్నాడే, వాడింకా కొంచెం కుంయి కుంయి మంటున్నాడు.

చక్ర : వాడిని కూడా ఒక వరుస దరువు బట్టిస్తే సరి.

నాగేం : (ఆలోచిస్తూ) అంతకంటె ముందు వాణ్ని పిలిపించి ఒక పాచికవేస్తే బాగుంటుందేమో ?

చక్ర : ఏమిటా పాచిక ?

నాగేం : మీరు మహమ్మదీయులు. వాళ్లు హిందువులు అని చీలికబెట్టి చూడాలి. అంతగా కాకపోతే డబ్బాశ కూడా పెడదాం. లొంగుతాడా వాళ్ళ పదిమంది అండాదండగా వుంటారు. లేకపోతే అప్పుడే వుంది మీరన్న పిడుగురాళ్ళ సెక్షన్.

చక్ర : ఆల్‌రైట్ ఎత్తు బాగానేవుంది.

(వెంకన్న ప్రవేశం)

నాగేం : ఏరా రైతులు ?

వెంక : వచ్చారండి దేవిడీ ముందున్నారు.

నాగేం : (వెంకన్నను దగ్గిరకుబిల్చి) ముందుగా కాసిం వొక్కణ్నే రమ్మని తీసుకురా !

వెంక : సిత్తం (వెళతాడు)

చక్ర : అయితే నేను లేకుండావుంటేనే బాగుంటుందేమో ? కాఫీ తాగివస్తాను. కానియ్యి. (వెళ్ళిపోవును)

(కాసిం వెంకన్నల ప్రవేశం; కాసిం దణ్ణంపెట్టి పక్కగా నుంచుంటాడు)

నాగేం : వెంకన్నా, దొరగారు కాఫీ తీసుకుంటున్నారు. కాసేపు ఆగమంటని రైతుల్ని అక్కడే కూర్చోబెట్టు. నీవుకూడా అక్కడేవుండు పో. (కాసింతో) కాసిం, నుంచున్నావేం ? కూర్చోవోయ్.

కాసిం : హొండుక్క లేండీ.

నాగేం : పాప మీ మధ్య జబ్బు పడ్డావటగా. కులాసా యేనా ?

కాసిం : హాఁ. హిప్డూహిప్డూ జరా తిర్గుతూ వుండా బాబూ.

నాగేం : కాసిం. ఎందుకోయ్ నీకీ సంఘాల గొడవ? వాళ్లంటే పదిమంది గలాళ్లు. మీరో రెండు కొంపలాళ్లు.

కాసిం : హైతే?

నాగేం : ఆఁ అయితేనా? వాళ్లంతా హిందువులు. మంచికీ చెడ్డకీ ఒకళ్ళ కొకళ్లు అండా దండగా వుంటారు. అవసరం వచ్చి చంక కెక్కించుకుంటున్నారు గాని, లేకపోతే మీ మహమ్మదీయుల ముఖం చూచేదెవడోయ్.

కాసిం : హిప్డూ ఆ గొడ్వహేమీ లేదూహండి. కులం, మతం తగాదాల్ కొంచెంగూడా లేకుండా, మా రైతుల్ హంతా భాయీభాయీగా హుంటుండాం.

నాగేం : ఆ......ఇలాటివెన్ని జూచాం, మాటల్లోగాని క్రియల్లో నిలచి చస్తయ్యాటోయ్. అయినా పిల్లాజల్లా గలాడివి. నీ బ్రతుకు తెరువు నీవు జూచుకోవాలి. దొరగారితో జెప్పి రెండెకరాల కొండ్ర పట్టా యిప్పించే యేర్పాటు జేస్తా.

కాసిం : హింద్కుహండీ నాకీ పిల్పిస్తా. అచ్చా. అచ్చా. మీకీ పేదోళ్కిచూస్తే నిండా దయూహండీ. హెంద్కూలెండీ. ఇట్టా బతాకినియ్యండి. హంతే సాల్. (వెళ్ళబోవును)

నాగేం : కాసిం, నీ మేలుగోరి చెప్తున్నా. జాగ్రత్తగా ఆలోచించుకో.

కాసిం : ఫర్వాలేదులెండి.

నాగేం : జాగ్రత్తగా ఆలోచించుకో సుమా.

కాసిం : మరేం ఫర్వాలేదులెండి (వెళ్లిపోవును)

చక్ర : (ప్రవేశించి) ఏమయిందోయ్ !

నాగేం : వాడెక్కడ వింటాడండి. వట్టి మొరటు ముండా కొడుకు. ఎన్నివిధాల చెప్పినా వినందే ? వాళ్ళంతా మంచి కట్టుగా వుంటున్నారు.

చక్ర : ఉంటారు. ఉంటారు. ఎందుకుండరు ? ఇదంతా ఆ ముసలిముండ నారాయణ తల్లి చేస్తూంది. ఆడది కాదూ, కాస్త జాలిగా అయ్యా బాబూ అంటూ వుంటే అంతా దానివల్లో పడుతున్నారు.

నాగేం : చేస్తుంది, చేస్తుంది; కూటికీ గుడ్డకూ మొఖం వాచి చచ్చేదే, అచ్చయ్యగారమ్మాయి సహాయం జేయక పోతే !

చక్ర : (ఆశ్చర్యంగా) ఏమిటి ? నారాయణ తల్లికి అచ్చయ్య గారమ్మాయి సహాయమా ? ఈ సంగతి అచ్చయ్యకు తెలుసునా ?

నాగేం : ఏమో, తెలిసినా ఆ అమ్మాయి చేతికి యీాయనేం అడ్డం వెళ్తాడులెండి.

చక్ర : అయితే యితడు వట్టి మమ్మా అన్నమాట. అందు కనే యెవ్వడు కదిలించినా నీళ్లు నములుతూ వుంటాడు.

నాగేం : తమదగ్గర నిక్కచ్చిగా జెప్పలేక నీళ్లు నమలడమే కాని అసలామె గట్టిగా తెగేసి చెప్పిందటలెండి.

చక్ర : అంతకాడి కొచ్చిందీ? ఏం దీని పొగరు?

నాగేం : నుయ్యో, గొయ్యో, చూచుకుంటాసని బెదరించిందట. ఇంకేముంది అచ్చయ్య గుడ్లు తేలేశాడు.

చక్ర : అయితే యిక నిరాశ చేసుకోవాలిసిందే? నాఅంతటి వాణ్ణి నోరుతెరచి అడగడం, ఆపిల్ల నాకెదరించడమూనా? ఎంత అప్రతిష్ట.

నాగేం : కాస్తా. పదిమందినోట్లో పడ్డాక.

చక్ర : (ఆవేశంతో) ఇంతమాత్రానికే వదలిపెడతామా? (తలవూపుతూ) చూస్తా. నయాన గాకపోతే భయాన్నయినా సాధించి తీరతా.

నాగేం : మీరు నయాన సాధించాలని చూచారు గాబట్టే యిన్నాళ్లు బట్టింది, లేకపోతే యీపాటికి కొండ మీదకోతి దిగివచ్చేది.

చక్ర : ఇకజూస్తా, ఎట్లాదిగిరాదో, (సిగరెట్టు ముట్టిస్తాడు)

నాగేం : దానికి తగినయెత్తు వేద్దాంలెండి. ముందీరైతుల సంగతి జూడండి. (బిగ్గరగా) వెంకన్నా, రైతుల్ని బిలువు?

(అచ్చయ్యగారు ప్రవేశించి నమస్కారం జేస్తాడు)

నాగేం : రండి అచ్చయ్యగారూ. కూర్చోండి.

(కాసిం, వీరయ్య. కోటయ్యలు ప్రవేశించి దణ్ణంబెట్టి ఒకపక్కగా నుంచుంటారు.)

చక్ర : కాసిం.

కాసిం : (విధేయతగా) హయ్యా,

చక్ర : ఏమోయ్, నీకేదయినా యిబ్బందుంటే నాకొచ్చి చెప్పుకోక వూళ్ళో ఏమిటి గోలచేస్తున్నావట?

కాసిం : గోలా? గోలాయేమ్టిహాండి? హెవ్వర్ సెప్పార్?

వీర : తనపనేమో తానేమో కాని కాసింకు రెండో గొడవ లేనేలేదండి.

చక్ర : ఏదో సంఘం బెడుతున్నావటగా కాసిం?

కోట : అవునండి, అందరం గలిసి పెట్టుకున్నాం.

కాసిం : కాస్తాదాన్కీ, కూస్తాదాన్కీ. మంచిచెడ్డా లేకుండా హందర్ మన్సీ దొరగారి హెదట్కీ రావడం మంచీ కాదూ తల్సీ, షంగంవుంటే షంగం పెద్దా హెళ్ళి మాటాసేస్తే మంచీఅని, అందరం గల్సీ హిష్టా హిష్టా పెట్టుకున్నామండీ.

చక్ర : ఎందుకోయ్ ఈ సంఘాలు? ఏనాడున్నాయి? పని పాటల్లేని వెధవలు బెట్టుకొనే సంఘాలు మీకెందుకోయ్. ఎవడికి గల్గిన కష్టం వాడొచ్చి చెప్పుకునే

డానికి, సంఘం పేరుతో యేకుర్రకుంకనో పంపిస్తారు. మీాకూ ఎస్టేటుకూవున్న లావాదేవీలు వాడికేం తెలుస్తాయి.

నాగేం : దొరగారు చెప్పినట్లువింటే బతికిపోతారు. ఎందుకీ సంఘాలన్నీ? మొన్న కొండయ్యవచ్చి తన యింట్లో పెండ్లిఅని చెప్పుకుంటే రెండు బండ్ల కట్టెలకు చీటీ యివ్వాలా?

కాసిం : కోన్, మీాకీ సాచ్చం చెప్పినా కొండయ్యాహండి?

చక్ర : మేం చెప్పాలిసిందేమో చెప్పాం. తర్వాత యెవడి ఖర్మ వాడిది?

కోట : అరకలూడదీసి వచ్చామండీ సెలవిప్పిస్తారా?

నాగేం : రేపు పెద్దదొరగారు చనిపోయిన రోజు. ఆవిషయం చెప్పటానికే దొరగారు మిమ్మల్ని పిలిపించింది.

రైతులు : చిత్తం, చిత్తం.

నాగేం : ప్రొద్దున్నే గొల్లవాళ్ళొస్తారు. పాలూ పెరుగు సిద్ధంగా ఉంచండి, పోండి.

వీర : గొల్లొళ్ళెందుకు బాబూ, పాడివుంటే మేము తెచ్చి యియ్యం?

కాసిం : హేమీా తేవాలహండీ. ఉన్నా గొడ్డుల్ సాబ్బీ మర్ గయా. అక్డా హక్డా హొక్టి అరా వున్నా మేతా లేక పాలు యిచ్చేదిలేదు.

నాగేం : చాల్లేండయ్యా సంతోషించారు. ఎన్నడనాా ఎరుగుదురా యీ మేతకటువు, ఈ జబ్బులు.

వీర : ఇంత పాపం ఎన్నడూ ఎరగమండి. మా మాట అబద్ధమైతే యింకా అచ్చయ్యగారి నడగండి.

అచ్చ : ఆమాట నిజమేలేండి. ఈయేడు పశువు చాలా నష్టమయింది. మా దొడ్డి కూడా చాలా భాగం ఊడ్చేసింది. ఒకటో రెండో మిగిల్తే అవే నాలుగు ధారలిస్తూవుంటే అట్టట్టా కాలం వెళ్ళబుచ్చుకుంటున్నాం.

నాగేం : (నవ్వుతూ) చచ్చినవి చావగా మిగిలినవన్నా యిస్తున్నాయి మీకు. వాళ్ళకది కూడా లేదట పాపం.

అచ్చ : అవును. మనం పదిగొడ్లు కలవాళ్లం గనుక కొన్ని చచ్చినా మిగిలినవన్నా యిస్తున్నాయి. అసలు వాళ్ళకుండేదే ఒకటీ అర. అది కాస్తా చస్తే వాళ్ళకింకా యెక్కడనుంచి వస్తాయి ?

నాగేం : (వ్యంగ్యంగా) ఆఁ అలాగా పాపం. బీదవాళ్ళని దయదలచి వూరందరికి మీరే తలాకాసిని మజ్జిగ సప్లయి జేస్తున్నారు గాబోలు.

అచ్చ : దయ అనేది పుట్టుకలో రావాలిగాని యివ్వాళ కొని తెచ్చుకోవాలంటే వస్తుందా ?

కోట : పోనీ ఎక్కడన్నా ఒకటీ అరా మిగిలినా వాటి ముఖాన వేయడానికి నాలుగు గడ్డిపరక లుంటేనా? ఈ యేడేమన్నా పండిందా అంటే దివాణపు పొలం కాస్తా కూస్తా అచ్చయ్యగారి పొలమేగా. మేమే మన్నా క్రమీద కొడవలేశామా?

నాగేం : చాల్లేవయ్యా, తెలివి కలాడివి బయలు దేరావు.

కాసిం : మాకీ తెల్వీవుండి ఫాయిదా క్యా.

చక్ర : ఏమిటీసోది నాగేంద్రం? ఇంతకూ పాలు వచ్చేదా రానిదా?

అచ్చు : లేవు మొర్రో అని వాళ్ళేడుస్తుంటే 'పిచ్చుక మీద బ్రహ్మాస్త్రం' మని ఆ పేదముండా కొడుకులతో పంత మెందుకండీ? మీకు పాలు కావాలసివస్తే కరువై నయ్యా?

నాగేం : కరువవడం లేకపోవడం ఆ సంగతి వేరు. మామూలు ప్రకారం పంపించా లంటారా? లేదా?

అచ్చు : అయినదానికీ కానిదానికీ యింత పట్టుదల మంచిది గాదు?

చక్ర : పిలవనీ పేరంటానికి బయలు దేరడమూ మంచిది కాదు.

అచ్చు : ఆ సంగతి యిప్పుడే తెలుసుకుంటున్నా.

నాగేం: దానివల్ల పెద్ద మునిగిపోయేది కూడా వుండదను కుంటాను.

(జమీందారు, నాగేంద్రం నవ్వుతారు)

నాగేం: (రైతులవైపు జూచి) ఇంతకూ మీరు పాలు పంపిం చేదా? లేనిదా?

కాసిం: అరే. అసల్ గొడ్లూ లేమా చెప్తావుంటే పాలు కావాలి సెప్తావ్ హేమిటండీ.

చక్ర : (కోపంతో బల్లగుద్దుతూ) గొడ్లులేకపోతే మనుషులు దగ్గర తీసుకరాండి మాకు కావాలిసింది పాలు.

(అచ్చయ్య ఉగ్రుడౌతాడు - తమాయించుకుంటాడు)

కోట : (కోపంతో కండ్లెర్రజేసి) ఏమిటీ? మనుషులదగ్గిరా? నీయింట్లో తద్దినాలకీదినాలకీ మనుషులపాలు కావాలా? నీవెంత జమీందారు వయినా, నీకెంత డబ్బున్నా, మేమూ మనుషులమే. మాకూ చీమూ నెత్తురుంది. కొంచెం జాగ్రత్తగా మాట్లాట్టం మంచిది.

నాగేం: ఏయ్ జాగ్రత్త! ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసునా?

కాసిం: క్యారే - హేంటి-మాటాసేస్తావు? అరే థూ నీదీ హౌక్కీ బతుకు- డాకర్ బతుకు.

చక్ర : అరేవెంకన్నా, ఈగాడిదను మెడమీద కర్రేసిగెంటు. (వెంకన్న తటపటాయిస్తాడు) దెయ్యంలాగా చూస్తా వేం వెధవా? గెంటు. ఊ.

(వెంకన్న మెల్లగా కాసిం దగ్గిర కొస్తూవుంటాడు.)

కాసిం: ఖబర్దార్. (వెంకన్న ఉలిక్కిపడతాడు)

కోట : గెంటిస్తావ్. గెంటిస్తావు. అదీ దగ్గిరకొచ్చింది, పాపం పండింది. పదండిరా. (రైతులందరూ మిర్రిమిర్రి చూపులు జూస్తూ వెళ్ళి పోతారు)

నాగేం: వీళ్ళ తల కొవ్వు పెరిగిపోయింది. కత్తికొక కండ జీల్చాలి.

అచ్చు: (లేస్తూ నాగేంద్రంతో) చాలు. అంతటితో కట్టిపెట్టు. ఈనాటి మీచర్య మానవత్వమున్న యేవ్యక్తీ సహించలేదు. ఇందుకు ప్రతిఫలం త్వరలోనే అనుభవించాలిసి వుంటుంది. ఓర్పుకు కూడా ఒక హద్దుంటుంది. తెగేదాకా లాగడం మంచిదిగాదు. జాగ్రత్త (వెళ్ళిపోవును).

చక్ర : ఇందుకు... ప్ర ...తి... ఫ...లం ...త్వర ... లోనే అనుభవించాలిసి... వుంటుంది. ఊఁ నీవో... నేనో ?

# 13

## అచ్చయ్యగారిల్లు

[విమల కుర్చీలో కూర్చొని పేపరు చూస్తూవుంటుంది. ఉత్తరం చేత్తోపట్టుకొని ఆదుర్దాగా శాంతమ్మ ప్రవేశిస్తూ]

శాంత: అమ్మాయీ! యిమళమ్మా.

విమల: (సైడులో) ఎవరు?

శాంత: నేనేనమ్మా.

విమల: ఒహో, అమ్మమ్మా, రా.

శాంత: అబ్బాయి వుత్తరం వేసాడమ్మా, (విమలచేతికిస్తూ) ఏం రాశాడో చదువమ్మా.

విమల : (ఉత్తరం విప్పిచూచి) మనం రాసిన వుత్తరం అందిందట.

(శాంతమ్మ ఊకొడుతూ శ్రద్ధగా వింటూవుంటుంది)

విమల : (ఉత్తరం చేత్తో వెనక్కు పట్టుకొని) కూర్చో అమ్మమ్మా.

శాంత: ఎందుకులే అమ్మా, ఎళతాను. ఇంకేం రాశాడు?

విమల : (సంతోషంగా) ఏముంటాయి ?...... వాళ్ళిద్దరూ క్షేమంగా ఉన్నారట, మన క్షేమం అడిగారు.

శాంత: సరేలే అమ్మా. సరే. ఇంతేనా సంగతులు.

విమల : ముందు నీవు కూర్చుంటే తర్వాత నీకో మంచిమాట చెప్పుతా.

(శాంతమ్మను చేయిబట్టుకొని కుర్చీలో కూర్చోబెడుతుంది)

శాంత: (భద్రంగా కూర్చుంటూ) చెప్పమ్మా, అదేమిటో చెప్పు.

విమల : (మరోకుర్చీలో కూర్చుంటూ) అంతమంచిమాట వూరికేచెప్పకేం? చెప్పినందుకు నాకేమిస్తావు చెప్పు.

శాంత: నీకు నేనేమిస్తానమ్మా ?

విమ : ఏమీ యివ్వకపోతే వూరికే చెప్పుతాననా యేమిటి ?

శాంత: సరే. రాటంవడకనిస్తాలే చెప్పు. (ఇద్దరూ నవ్వుతారు)

విమల : (రాగాలుతీస్తూ) నారాయణరావూ, పుల్లయ్యగారూ యిద్దరూ ... ...

శాంత: ఊఁ. యిద్దరూ ?

విమల : పట్టుతారీకున విడుదలౌతారట.

శాంత: ఇంకా పట్టుతారీకెన్నాళ్లుందమ్మా ?

విమల: ఎన్నాళ్ళెక్కడమ్మమ్మా. రేపేగా.

శాంత: రేపేనా ? నేనియ్యాలతో యింకా యెనిమిది రోజుల కొస్తారనుకుంటున్నా. నిజమేనా అమ్మా ? రేపేనా !

విమల: నీతో నేనబద్ధం జెప్పుతానా అమ్మమ్మా, రేపక్కడ విడుదలయితే యెల్లుండి పదిగంటలకిక్కడి కొస్తారన్న మాట.

శాంత: అట్టాగా! అట్టయితే మనవాళ్ళందరికీ చెప్పొత్తా. కోటయ్యవాళ్ళు మళ్లీ పొలమెళ్లే యాలయిందిగా. ఎల్లొస్తానమ్మా.

విమల: ఊఁ.

శాంత: ఉండమ్మా, ఉండు.

విమల: (రెండడుగులు సాగనంపి) నేనుంటానమ్మమ్మా.

శాంత: అట్టాగే, ఉండమ్మా. (వెళ్ళిపోతుంది)

విమల: (తిరిగివస్తూ హుషారుగా)

పహిడ్ - జంపె

కోయిలా కోయిలా
పాడవే హాయిగా - కోయిలా
వాసంత ఋతురాజు వచ్చె మా వీటికిక
మోదైన మాతోట మోసులెత్తగసాగ
కనులపండువుగాగ కాయవలె పూయవలె ॥కో॥
కమ్ముకొనియున్న యీ కారుచీకటి చీల్చ
కూలీరైతులపాల బాలభానుండడుగో ॥కోయిలా॥

(అచ్చయ్యగారి ప్రవేశం, విమలలోపల కెళ్ళి కాఫీబట్టుకొని వస్తుంది. అచ్చయ్య కాఫీ తాగుతూ వుంటాడు)

విమల: ఏమిటినాన్నా, మొన్న చాలా గొడవ జరిగిందట !

అచ్చు: ఏముంది ? ఏదో జరిగిందిలే. వీళ్ళుమాత్రమేం తక్కువ తిన్నారా ?

విమల: రైతులు మొదట చాలా వినయంగానే మాట్లాడారటగా ?

అచ్చు: మాట్లాడారు ! ఎట్లయినా వాడు జమిందారు. వీళ్ళు రైతులు. వాడు పాలు కావాలని పిలిపించి కొంత మొండిపట్టే పట్టాడనుకో. వీళ్ళుకూడా వాడిముఖాన్నే ససేమిరా అనకపోతే నోటితో లేదనేదానికి బదులు యివతలికివచ్చి చేత్తో లేదంటే పోదూ.

విమల: ఎంత ససేమిరా,అన్నా, రైతుల్ని బట్టుకొని జమీందారంత మాటంటాడా నాన్న.

అచ్చు : వాడికీ వచ్చింది పొయ్యేకాలం.

విమల: మీరున్నారని కూడా చూడలేదటగా.

అచ్చు : ఏముందీ వినాశకాలే విపరీతబుద్ధి.

(ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ పూలబుట్ట తీసికొని వెంకన్నప్రవేశం)

అచ్చు : ఏరా, వెంకన్నా ఏం పనిమీద వచ్చావ్.

వెంక : (వినబడక) ఏమీలేదండి పూలు.

అచ్చు : ఎక్కడివిరా ?

వెంక : మనింటికాడ మొన్న పండగపూట అమ్మాయిగారూ బువ్వెట్టలా ? ఆయాళ మద్దినాలే సెప్పారండి.

అచ్చ : ఏమిటిరా నీబొంద, ఎవళ్ళు చెప్పారు? ఏమని చెప్పారు?

వెంక : (నవ్వుతూ) ఎంకన్నా, ఎంకన్నా మనతోటలో ఒక బుట్టెడు పూల్టుకెల్లి అచ్చయ్యగారింట్లో యిచ్చి రారా అని ఆయాలే సెప్పారండీ. ఈ గోల్లో నేనే మరచి పోయానండి.

విమల : (కోపంగా) ఎవడ్రా చెప్పింది?

వెంక : (వినబడక) మీ కేనండి.

విమల : (గద్దించి) ఎవడ్రా నీతో చెప్పింది?

వెంక : మన దొరగారండి, బుల్లెమ్మగారూ.

విమల: (కోపంతో) దొ...ర...గా...రు దొ...ర... గా...రు (అంటూ బుట్ట తీసికొని వెంకన్నను లాగి కొడుతుంది. వెంకన్న చేతు లడ్డంబెట్టి తప్పుకుంటాడు. బుట్ట కిందబడుతుంది) దొరగారట దొ...ర... గా...రు (అనుకుంటూ) బుట్ట కాలితో తన్నుతుంది.

వెంక : (తూలిపడుతూ, వెనక్కె-నక్కు- తారుతూ) దణ్ణ ముండీ బుల్లెమ్మగారూ దణ్ణముండీ (పారిపోతాడు)

విమల: (కోపంతో) పుట్టాడు పుటక. వీడి పుటక తగలెయ్య. ఇంతకూ మీరే నాన్నా, వాడికింత అలుసిచ్చింది.

(అచ్చయ్య మాట్లాడకుండా లోపలి కెళ్ళిపోతాడు.... విమల కోపంతో పూలను కాలితో రాస్తూవుంటుంది)

(తెర)

# 14

(పుల్లయ్య గారి ల్లు)

[శాంతమ్మ మినప్పప్పు చేటలోబోసుకొని బాగుచేస్తూవుంటుంది. విమల కబుర్లు చెప్పుతూ కూర్చొనుంటుంది]

శాంత: పదిగంటలకే రావాలిసింది. పొద్దు నెత్తిమీదికొచ్చినా యెవరూ అంతులేరే?

విమల: వస్తూవుండాలి అమ్మమ్మా. బండేమయినా ఆలశ్య మయిందేమో?

శాంత: ఏమోనమ్మా కోడికీనాకూ తెల్లారింది. కన్నుమూస్తే ముందువాడు, ఎనక పుల్లయ్య వచ్చినట్టూ అమ్మా అని పిల్చినట్టూ కనపడేది. ఎట్లావుండారో సన్నాసులు ఆ జైలు కూడుదిని? ఎంత చిక్కిపొయ్యారో?

విమల: మొన్ననే కాదమ్మా ఉత్తరం వచ్చింది? అందులో ఆరోగ్యం బాగానేవుందని రాశారుగా?

శాంత: వాడొకప్పుడు మాత్రం చిక్కిపోతే చిక్కిపొయ్యానని రాత్తాడా. నేను మనాదిపెట్టుకుంటానని నిజం తెలియ నియ్యడమ్మా.

(తెరలో రైతుసంఘాలకి జై అంటూ వినపడుతుంది)

మోహన - దాద్రా

పీడిత ప్రపంచమంత నేడు మేల్కొనెన్ నేడు
మేల్కొనెన్

నిదురదేల వేగలెమ్మ నీవు కర్షకా, నీవు కర్షకా
ఈగతిన్ కృశించి క్రుంగిపోవనేలరా
జాగఏల నీదుహక్కు లడుగ రమ్మురా కర్షకా
॥పీడిత॥

ఇమ్మహా దరిద్రమింక యెన్నినాళ్లుర ?
లెమ్మధర్మమున్ యెదిర్చి పోరుసల్పర
ఎదిర్చి పోరుసల్పరా, ఎదిర్చి పోరుసల్పరా
కామితార్థ సిద్ధికిపుడె కదలిరమ్మురా
ఇపుడె కదలిరమ్మురా, ఇపుడె కదలి
రమ్మురా కర్షకా ॥పీడిత॥

విమల : అదిగో నమ్మమ్మా పాట వినబడుతోంది.

శాంత : అయితే మనవాళ్లొచ్చే వుంటారు.

విమల : నారాయణరావు పుల్లయ్యగార్ల గొంతులు కూడా వినపడుతుంటే. (శాంతమ్మ పరమ సంతోషంగా నాలు గడుగులు ముందుకేసి గడపదగ్గర కొచ్చి నుంచుం టుంది. విమల రెండడుగులేసి అక్కడే ఆగిపోతుంది. నారాయణరావు పుల్లయ్య యితర రైతుల ప్రవేశం.

వచ్చారా అయ్యా అంటూ శాంతమ్మ నారాయణ రావు పుల్లయ్యగార్ల చేతులు బట్టుకొని ఊపుతుంది. అంతావచ్చి కూర్చుంటారు. శాంతమ్మ నుంచొనుంటుంది. విమల కూడా అలాగేచూస్తూ నిలబడివుంది)

శాంత : అట్టా చిక్కిపోయారేం నాయనా ?

పుల్ల : ఏంచిక్కా మక్కయ్యా. రాత్రి సరిగ్గా నిదరలేదాయె. ఎండలోబడి నడచి రావడం ప్రయాణ బడలికవల్ల అట్టా కనపడుతున్నావేమో ?

నారా : (విమలను జూచి) నాన్నగారు బాగున్నారా విమలా?

విమల : (చిరునవ్వుతో) మేమంతా బాగానేవున్నాం. కాస్త అమ్మమ్మే చిక్కిపోయింది.

కాసిం : అరె బాబా, సిక్కిపోవడం క్యా, మీరూ హెళ్ళిందీ మొదల్ హూక్కొట్టి పూటా సరిగ్గా హన్నం తిన్నదీ హండి. హమేషా షంగం షంగం అంటూ హెప్డూ పనిసేస్తూ వుండేదీ. హూక్డీ నిమిషం కూడా మాకీ కూచోనిచ్చేదీ లేదు. హామె కూచున్నదీ లేదూ హేమ్టిా సెప్పవాలె.

శాంత : నాదేముందిరా! అంతా యిమళమ్మే చేసింది. ఏదో పదిమందిని పిలవటమేకాని ఆళ్ళకు పాటలు నేరపటం పద్దేలు నేర్పటం అంతా యిమళమ్మే, ఇదంతా ఎందు

కురా అబ్బాయీ, నీవు జైలుకు పోయినప్పణ్నుంచి నన్ను కన్నతల్లిని చూసినట్టు చూసిందనుకో.

(విమల కొంచెం తల వంచుకుంటుంది.)

పుల్లి : మేం మాత్రం జైల్లో వూరికే కూచున్నామా ?

నారా : పుల్లయ్య మామకూడా జైల్లో చదువుకున్నాడు కాసింభాయి.

కాసిం : ఐసాబోలో క్యా మామా ?

పుల్లి : నా చదువు కేం వచ్చెగాని కాసిం. అవ్వాళ కోర్టు కొచ్చిన వాళ్ళనేచూసి యెంతో మంది అనుకున్నాం. జైల్లోకి పోయిచూస్తే అంతా వీళ్లేరా? ఎప్పుడూ ఇంగిలీషు, హిందీ, యింతింతలావు పుస్తకాలు చదువుతూ వుండేవాళ్ళురా. మనదేశపు సంగతులు సరేనా. రష్యా, జర్మనీ, చైనా, జపాను, ఇంగ్లండు, అమెరికా – ఒకటేమిటిరా? వీళ్ళకి ప్రపంచమంతా తెలుసు.

వీర : ఏమిట్రో పుల్లయ్యా, నోరు తిరగని పెద్దపెద్ద మాటలు నేర్చుకున్నావే ?

కాసిం : అరే షద్యూ మూడోనేత్రం సెప్పారుగాదూ పెద్దల్.

విమల : అమ్మమ్మా, నాన్నగారు వచ్చేవేళయింది. వెళ్ళతాను.

శాంత : పోయిరా అమ్మా. (విమల వెళ్లుతుంది)

కోట : (ప్రవేశించి) అరే నారాయణా, పాలు పంపలేదనే కోపంతో మన పాడి గొడ్లన్నింటినీ చంపెయ్యాలని చూస్తున్నాడురా. రాత్రి మళ్ళీ మావాళ్ళ గేదకొక దానికి మందెట్టారు.

వీర : ఓరి నీపాపం పాడుగాను! దీనితో ఆగోదన్న మాట ఊళ్లో.

కాసిం : మస్కీ సచ్చుతనాన్కి కన్పెట్టి జాన్వర్‌లా చూస్తుం డార్. హివ్వాళ హారూ అయింది. రేపు హెన్మిదీ అవుతుంది.

నారా : మనమంతా తగిన జాగ్రత్త తీసుకోవాలి. తగిన కట్టు దిట్టాలతో వూరికి నాలుగువైపులా కాపలా గాయాలి. ఆదొంగ ఎవడో దొరికేదాకా మనం కనుమూయ రాదు.

పుల్ల : కాపలాగాసి ముందువాణ్ణి పట్టుకోవాలిసిందే.

నారా : వీరయ్యన్నా, మాపటికందరూ పెందలాడే భోంచేసి రాండి. సరియైన ప్లానేసుకొని వాడీపని పడదాం.

కాసిం : అచ్ఛా. అచ్ఛా.

(అందరూ లేచిపోతూ వుంటారు)

శాంత : అబ్బాయి పుల్లయ్యా, నీకూడా భోజనం యిక్కడే.

నారా : (కాసిం చేయిబట్టుకొని) అమ్మా మన కాసిం పొద్దు బోయి అంతదూరం వెళ్ళి యెక్కడోస్తాడులే. మా ముగ్గురికి వడ్డించు.

శాంత : అట్లాగే రాండి నాయనా.

(శాంతమ్మ, నారాయణరావు, పుల్లయ్య, కాసింలు ఒకవైపు మిగతావా రొకవైపుకు వెళ్ళిపోతారు)

# 15

[నారాయణరావు, పుల్లయ్య, కాసిం, వీరయ్య, కోటయ్య, సుబ్బయ్యలు కర్రలతో ప్రవేశిస్తారు ]

నారా: నలుగురూ నాలుగుపక్కలా జాగ్రత్తగా కాయండి. ఎవడయినా కనపడితే సాధ్యమయినంతవరకు పట్టుకోండి. పారిపోవడానికి ప్రయత్నిస్తే కాళ్ళమీద కొట్టి పడగొట్టండి: కాని చావుదెబ్బలు కొట్టవద్దు సుమా! నేనూ, కాసిం పైపక్కన కాస్తాం. ఎట్లా అయినాసరే యీరాత్రి దొంగను పట్టితీరాలి.

పుల్ల : లేకపోతే చావగా మిగిలిన నాలుగు గొడ్లను యిట్లా చంపుకొని మనం చేసేదేమిట్రా? సుబ్బయ్యా, నీవు తూర్పు బజారు కెళ్ళరా?

వీర : నేను శ్మశానంపైపు కాస్తారా?

కాసిం: హాఁరె. మీ యిద్దర్ చెరొకపక్కకీ హెళ్ళండి.

నారా: రా కాసింభాయీ, పోదాం. (అందరూ వెళ్ళిపోతారు)

(నలుగురు రౌడీలను వెంటబెట్టుకొని నాగేంద్రం ప్రవేశిస్తాడు, అందరూ నల్లటి ముసుగులు కప్పుకొని వుంటారు. చేతిలో కర్రలూ తాళ్ళూ వుంటాయి. పొంచి పొంచి అటూ యిటూ చూస్తూ అడుగులేస్తూ వుంటారు )

నాగేం: (సైగజేస్తూ మెల్లగా) ఎక్కడ?

1వ రౌడీ: (చేయిజూపుతూ) అటూ, అటు, ఆ వాకిలిగుండా.

(కొందరి నటుబొమ్మని, కొందరి నిటురమ్మని సైగజేస్తాడు. అందరూ రెండువైపులనుంచి వెళ్ళిపోతారు. రౌడీలు అచ్చయ్యగారిదొడ్లో ప్రవేశించి ముందు విమల, అచ్చయ్యగార్ల నోర్లు బిగగడతారు. అచ్చయ్య గారిని, మంచానికేసి అంటగట్టి విమలను పిల్లి భీముడు మోసుకొస్తూ వుంటారు. తెరలోనుంచి కొద్దిగా మూలుగు వినపడుతుంది. నారాయణ రావు పరుగెత్తుకుంటూ వచ్చి పిల్లిభీముణ్ణి కొడతాడు. దెబ్బకు గింగిరాలు తిరిగి పిల్లిభీముడు కిందపడతాడు. విమల ఒకపక్కకు పడిపోతుంది. తక్కిన రౌడీలు పారిపోతారు, నారాయణరావు విమల కట్లు ఊడదీస్తూ వుంటాడు. కాసిం పారిపొయ్యే రౌడీల వెంట బడతాడు, నాగేంద్రం వెనకగావచ్చి నారాయణరావు భుజంపైన కత్తితో పొడిచి పారిపోతాడు. నారాయణరావు "అబ్బా" అని పడిపోతాడు. ఇంతలో వీరయ్యా కోట య్యలు వస్తారు. వీరయ్య నారాయణరావు దగ్గిర కూర్చొని నెత్తురద్దుతూ వుంటాడు.)

కోట : నీ విక్కడేవుండు.ఆడిటే వెళ్ళాడు (పరుగెత్తుతాడు)

(పుల్లయ్య కోటయ్యల ప్రవేశం-పుల్లయ్య అయ్యో అంటూ నారా యణరావు దగ్గిరకెళ్ళి దీనంగా చూస్తూవుండగా పక్కన విమల కనపడు తుంది. 'పాపం' అంటూ పుల్లయ్య విమల కట్లు విప్పుతూ వుంటాడు. కోటయ్య పిల్లి భీముణ్ణి చేతులుగట్టి ఒకమూల కూలేస్తాడు. ఇంతలో తెరలో మూలుగు వినపడుతుంది. కోటయ్య లోపలికెళ్ళి. అచ్చయ్యగారి కట్లు విప్పుతాడు. అచ్చయ్య "విమలా, విమలా" అంటూ సగం వూడీ వూడని తాళ్ళు చేతులకు వేలాడుతూవుండగా ఆదుర్దాగా వస్తాడు. విమల తండ్రిని జూచి "నాన్నా, నాన్నా" అని కౌగిలించుకుంటుంది. అచ్చయ్య విమలలు పడిపోయివున్న నారాయణరావును జూచి నివ్వెర పోతారు )

# 15

[నారాయణరావు, పుల్లయ్య, కాసిం, వీరయ్య, కోటయ్య, సుబ్బయ్యలు కర్రలతో ప్రవేశిస్తారు]

నారా: నలుగురూ నాలుగుపక్కలా జాగ్రత్తగా కాయండి. ఎవడయినా కనపడితే సాధ్యమయినంతవరకు పట్టుకోండి. పారిపోవడానికి ప్రయత్నిస్తే కాళ్ళమీద కొట్టి పడగొట్టండి: కాని చావుదెబ్బలు కొట్టవద్దు సుమా! నేనూ, కాసిం పైపక్కన కాస్తాం. ఎట్లా అయినాసరే యీరాత్రి దొంగను పట్టితీరాలి.

పుల్ల : లేకపోతే చావగా మిగిలిన నాలుగు గొడ్లను యిట్లా చంపుకొని మనం చేసేదేమిట్రా? సుబ్బయ్యా, నీవు తూర్పు బజారుకెళ్ళరా?

వీర : నేను శ్మశానంవైపు కాస్తారా?

కాసిం: హఁరే. మీ యిద్దర్ చెరొకపక్కకీ హెళ్ళండి.

నారా: రా కాసింభాయీ, పోదాం. (అందరూ వెళ్ళిపోతారు)

(నలుగురు రౌడీలను వెంటబెట్టుకొని నాగేంద్రం ప్రవేశిస్తాడు. అందరూ నల్లటి ముసుగులు కప్పుకొని వుంటారు. చేతిలో కర్రలూ తాళ్ళూ వుంటాయి. పొంచి పొంచి అటూ యిటూ చూస్తూ అడుగులేస్తూ వుంటారు)

నాగేం: (సైగజేస్తూ మెల్లగా) ఎక్కడ?

1వ రౌడీ: (చేయిజూపుతూ) అటూ, అటు, ఆ వాకిలిగుండా.

(కొందరి నటుబొమ్మని, కొందరి నిటురమ్మని సైగజేస్తాడు. అందరూ రెండుపైపులనుంచి వెళ్ళిపోతారు. రౌడీలు అచ్చయ్యగారిదొడ్లో ప్రవేశించి ముందు విమల, అచ్చయ్యగార్ల నోర్లు బిగగడతారు. అచ్చయ్య గారిని, మంచానికేసి అంటగట్టి విమలను పిల్లి భీముడు మోసుకొస్తూ వుంటారు. తెరలోనుంచి కొద్దిగా మూలుగు వినపడుతుంది. నారాయణ రావు పరుగెత్తుకుంటూ వచ్చి పిల్లిభీముణ్ణి కొడతాడు. దెబ్బకు గింగిరాలు తిరిగి పిల్లిభీముడు కిందపడతాడు. విమల ఒకపక్కకు పడిపోతుంది. తక్కిన రౌడీలు పారిపోతారు, నారాయణరావు విమల కట్లు ఊడదీస్తూ వుంటాడు. కాసిం పారిపొయ్యే రౌడీల వెంట బడతాడు, నాగేంద్రం వెనకగావచ్చి నారాయణరావు భుజంపైన కత్తితో పొడిచి పారిపోతాడు, నారాయణరావు "అబ్బా" అని పడిపోతాడు. ఇంతలో వీరయ్యా కోట య్యలు వస్తారు. వీరయ్య నారాయణరావు దగ్గిర కూర్చొని నెత్తురద్దుతూ వుంటాడు.)

కోట : నీ విక్కడేవుండు.అడిటే వెళ్ళాను (పరుగెత్తుతాడు)

(పుల్లయ్య కోటయ్యల ప్రవేశం-పుల్లయ్య అయ్యో అంటూ నారా యణరావు దగ్గిరకెళ్ళి దీనంగా చూస్తూవుండగా పక్కన విమల కనపడు తుంది. 'పాపం' అంటూ పుల్లయ్య విమల కట్లు విప్పుతూ వుంటాడు. కోటయ్య పిల్లి భీముణ్ణి చేతులుగట్టి ఒకమూల కూలేస్తాడు. ఇంతలో తెరలో మూలుగు వినపడుతుంది. కోటయ్య లోపలికెల్లి. అచ్చయ్యగారి కట్లు విప్పుతాడు. అచ్చయ్య "విమలా, విమలా" అంటూ సగం వూడీ వూడని తాళ్ళు చేతులకు వేలాడుతూవుండగా ఆదుర్దాగా వస్తాడు. విమల తండ్రిని జూచి "నాన్నా, నాన్నా" అని కౌగిలించుకుంటుంది. అచ్చయ్య విమలలు పడిపోయివున్న నారాయణరావును జూచి నివ్వెర పోతారు )

అచ్చ: ఎంత ఘోరం! ఎంత ఘోరం! (గబగబా లోపలికెళ్ళి మంచం దీసుకొచ్చి వాలుస్తాడు. నారాయణరావును మంచంమీద పండుకోబెడతారు. సుబ్బయ్యా కాసింలు నాగేంద్రాన్ని రెక్కలుగట్టి తీసుకొస్తారు.)

అచ్చ: ఆ ఛండాలుణ్ణి, పిల్లి భీముడిగాణ్ని – ధాన్యపుకొట్టు ఖాళీగా వుంది. అందులోబడేసి తాళం బెట్టండి. (నాగేంద్రాన్ని పిల్లిభీముణ్ని సుబ్బయ్యా కాసింలు తీసుకపోతారు. కాసిం వెంటనే తిరిగివస్తాడు)

అచ్చ : నాయనా కాసిం ముందు డాక్టర్ని పిల్చుకురా నే రమ్మన్నానని చెప్పు.

పుల్లి : అరే కోటయ్యా కాసిం ఒక్కడే వెళ్లుతున్నాడు. నీవు కూడా వెళ్లరా. (కోటయ్య కూడా వెళ్ళతాడు. విమల నారాయణరావు దగ్గిర కూర్చొని నెత్తురు కడిగి కట్టు సర్దుతూ వుంటుంది. అచ్చయ్య లోపలినుంచి తలగడ దిండుదెచ్చి నారాయణరావు తలకింద బెడతాడు. రైతులంతా విచారంగా చుట్టూ మూగుతారు. ఇంతలో శాంతమ్మ పరుగెత్తుకొంటూ వస్తుంది)

శాంత : అయ్యో కొడుకా (అంటూ కొడుకుమీద బడి యేడుస్తుంది.)

పుల్లి : (శాంతమ్మ చేయిబట్టుకొని లేవదీస్తూ) ఏడవ కక్కయ్యా ఏడవకు. నీ యేడ్పు వింటే వాడికసలే గుండె చెరుగుతుంది.

శాంత : (ఏడుస్తూ) నాయనా నీకెంత గతి పట్టిందిరా. ఒక సారి కన్నెత్తి చూడవూ? ఒకణ్ని పల్లెత్తు మాటని యెరుగవే? ఎవడికి చేతులాడినయిరా నిన్ను పొడవటానికి. ఇన్నాళ్ళూ పెంచి పెద్దవాణ్ని చేసి యీ పాపిష్టి జమీందారు పొట్టను బెట్టాగదరా!

అచ్చు : ఏడవకమ్మా ఏడవకు, ఫరవాలేదు. (చుట్టూ ఉన్న వాళ్లను సర్దుతూ) కొంచెం గాలిరానివ్వండి ఎంత పని జేశాడురా గాడిదకొడుకు జమీందారు. ఇంత పని జేస్తాడని కలలోకూడా అనుకోలేదు.

విమల : (ఆవేశంతో) ఎందు కనుకుంటావు. జమీందారేదో తవ్వి తలకెత్తుతాడని తోటిరైతుల్ని వదలిపెట్టి వాడి చంక కిందదూరి యింతవరకు తెచ్చింది నీవుకాదూ? మొట్టమొదటి నుంచీ నీవు వాడి వెనుకాల తాళం వేయకపోతే వాడింతపనికి సిద్ధమౌతాడా? ఊళ్లో రైతులంటే నీకో మనుష్యుల్లాగా అగపడ్డారా? నీకంటికి గడ్డిపరకలాగా కనపడే నారాయణరావే లేకపోతే నా బ్రతుకూ నీ బండారంకూడా బయటపడేదే. నిన్నూ నీ బిడ్డను కాపాడడం కోసం తన ప్రాణాన్ని బలి పెట్టాడు. చూడు ఆ నెత్తురు.

పుల్ల : అమ్మాయి! ఇదేనా సమయం వూరుకో.

అచ్చ : అనమ్మా అను నీ యిష్టంవచ్చినట్లను. ఆ దుర్మార్గు నితో కలిసి నేను చేసిన బుద్ధితక్కువ పనులకు నాకీ శాస్తి చాలదు.

పుల్ల : అసలా నాగేంద్రంగాడేరా మన నారాయణ్ని పొట్ట బెట్టుకుంది. (కాసిం మందుల సంచితో ప్రవేశం) డాక్టరుగారేరీ కాసిం ?

కాసిం : వస్తూ వుండార్.

శాంత : (నిట్టూర్పు విడుస్తూ) అయ్యో నాయనా!

పుల్ల : ఊరుకో అక్కయ్యా, డాక్టరుగా రొస్తా వుండారు.

శాంత : ఏరి నాయనా?

అచ్చ : అబ్బాయ్ ఒకకుర్చీ పట్టుకురారా (డాక్టరు ప్రవేశం. అచ్చయ్యగా రెదురుగావెళ్ళి నమస్కారంచేసి) దయ చేయండి డాక్టరుగారూ.

(డాక్టరుగారు కోటువిప్పి కుర్చీకి తగిలించి స్టెతస్కోపుతో హార్టు పరీక్షచేసి గాయం చూస్తాడు )

అచ్చ : ఎట్లావుందండీ డాక్టరుగారూ?

డాక్టరు : దెబ్బమాత్రం ప్రమాదమైనదే. అయినా ప్రాణ భయం వుండగూడదు.

(ఇంజక్షను యివ్వబోతూ వుంటాడు)

శాంత : (పిచ్చిదానివలె డాక్టరుదగ్గర కెళ్ళి) నాబిడ్డ బ్రతుకుతాడా? బతుకుతాడా నా బిడ్డను బలికించు నాయనా నిన్నే దేవుడనుకుంటాం.

డాక్టరు : ఆగమ్మా! ఆగు మరేమీ భయంలేదు:

పుల్ల : (శాంతమ్మ చేయిబట్టుకొని) నువ్వు యివతలకురా అక్కయ్యా అంటూ అవతలకు తీసుకపోతాడు.

డాక్టరు : రోగిదగ్గర గల్లంతు చేయకూడదు. గల్లంతుచేస్తే మరీ ప్రమాదం.

శాంత : చేయనులే నాయనా, నీచేతుల్లో పెట్టాను నాబిడ్డను బలికించునాయనా.

అచ్చు : ఊరుకోండి శాంతమ్మగారు, ఫర్వాలేదులే.

(డాక్టరు ఇంజక్షను ఇచ్చి కట్టుగడతాడు పుల్లయ్య నారాయణ రావు పక్కన కూర్చొని విసరుతూ వుంటాడు. డాక్టరు కుర్చీలో కూర్చుంటాడు. అచ్చయ్యగారు డాక్టరు పక్కన నుంచొని)

అచ్చు : డాక్టరుగారూ! ఎంతఖరీదు గల మందైనా సరే, ఎంత ఖర్చయినాసరే, మీరేమీ సందేహించకండి

డాక్టరు : దానికేమొచ్చి లెండి.

అచ్చు : మీరు కష్టమనుకోకుండా దయయుంచి యివ్వాళా రేపూ యిక్కడె వుండాలి.

డాక్టరు : మీమాట తీసేస్తానా? గాని, కొన్ని అర్జెంటు కేసులున్నాయ్, ఫరవాలేదు. రెండుపూటలూ తప్పకుండా వచ్చి చూచిపోతాగా.

పుల్లి : (సంతోషంగా) ఒక పక్కకొత్తిగిల్లాడండీ డాక్టరు గారూ.

డాక్టరు : స్పృహవస్తూవుంది. (శాంతమ్మ, విమల మిగతా రైతులందరూ చుట్టూ మూగుతారు)

శాంత : అయ్యా! నారాయణా! (నారాయణరావు కొంచెం కళ్లుతెరచి మళ్ళీ మూస్తాడు)

విమల : నీవు పిలవగానే కంళ్లు తెరచాడమ్మమ్మా.

శాంత : ఎంతకష్టం వచ్చిందిరా నీకు.

డాక్టరు : ఏమిటాగల్లంతు. ఎందుకలా మూగారు. ఇవతలకు రండి. (అందరూ వెనక్కి వస్తారు. డాక్టరూ, అచ్చయ్య మంచం దగ్గరికి వెళ్లుతారు. డాక్టరు ఒక డోసుమందు తాగిస్తూ; మరేం ఫరవాలేదు. నాలుగు రోజుల్లో తగ్గిపోతుంది.

నారా : అబ్బా (మూలుగుతూ మరొక ప్రక్కకు తిరుగుతాడు)

డాక్టరు : (మందుసీసా యిస్తూ)అచ్చయ్యగారూ! ఒక ఔన్సు నీళ్ళల్లో నాలుగు బొట్లువేసి రెండుసార్లు ఈమందు తాగించండి.

అచ్చ : ఆ జొన్నలగొడవ నాకు తెలియదు. అమ్మాయి చేతి కివ్వండి.

డాక్ట : (విమలచేతికి సీసాయిస్తూ) నాలుగింటి కొకసారి, ఆరింటి కొకసారి యివ్వమ్మా!

విమల : సరేలెండి.

డాక్ట : వెళ్లొస్తా అచ్చయ్యగారు, (అచ్చయ్యగారు, పుల్లయ్య మొదలైనవారు డాక్టరును సాగనంపి వస్తారు)

నారా : (కండ్లు తెరచి మెల్లగా) వాడేడీ ?

శాంత : (కళ్లు తుడుచుకుంటూ సంతోషంగా) ఎవడు నాయనా !

నారా : వాడే ఆ దొంగ

అచ్చ : దొంగలందరూ దొరికారు. నీప్రాణం అడ్డమేసి మమ్మల్ని గాపాడడానికి దేవుడులాగ వచ్చావు.

పుల్ల : తర్వాత మాట్లాడుకుందాంలెండి అచ్చయ్యగారూ· (నారాయణను చూస్తూ) డాక్టరుగారు మాట్లాడొద్ద న్నారు. కాసేపు కళ్లుమూసుకు పడుకో నాయనా.

అచ్చ : అబ్బాయి పుల్లయ్యా, యిక్కడ చలిగాలేస్తుంది. మంచం అవతలకు పడదాం పట్టూ.

(మంచం లోపలకు పట్టుతూ వుంటారు)

# 16

## అచ్చయ్యాగారిల్లు

(విమల చక్కగా అలంకరికచుకొని సంతోషంగా పాడుకొంటూ వుంటుంది.)

మధ్యమావతి - తీన్‌తాల్

దేశ సేవకుల హృదయం నవనీత తుల్యా మా
హృదయం ॥దేశ॥
సంఘంబున గల చెడుగు లన్నిటిని
సరిజేయగ కంకణము ధరించిన ॥దేశ॥
నిస్సహాయులౌ పరులపీడ గని
నీరై ప్రాణము లొసగెడి వీరులు
ప్రజా సేవయే పరమావధిగా
పగలు రాత్రి పలు బాములు పడు యీ ॥దేశ॥
నిరాడంబరులు నీతిశీలురు
కరుణారస సంభరితులు ఘనులీ ॥దేశ॥

(పేపరు చదువుకొంటూ నారాయణరావు ప్రవేశం)

నారా : (పాట చివర చరణం అందుకుంటాడు. విమల వెనక్కి తిరిగి చూస్తుంది. నారాయణరావు పేపరు కేసి చూస్తూ వుంటాడు)

విమల : ఎంతపనున్నా వేళ కాహారం తీసుకోవాలని గూడా తెలియదా ? నీ కెదురు చూస్తూ యెంత సేపని కూర్చోవాలి ? (అని నవ్వుతూ లోపలికెళ్ళి కాఫీ తీసుకొస్తుంది. నారాయణరావు కుర్చీలో కూర్చొని టేబులుమీద పుస్తకం తీసి చదువుతూ వుంటాడు.)

విమల : (కాఫీ అందించుతూ) ఏమిటి చదువుతున్నావు ?

నారా : ఆఁ నీదే - ఏదో పుస్తకం డ్రాయరుమీదుంటే చదువుతున్నా.

విమల : ఈ పుస్తకానికే కాదు. యిక్కడవున్న సర్వానికీ నేనే అధికారిని.

నారా : కాదని నేననలేదే !

విమల : ఆ ... మరి ... "యీపుస్తకం నీదే" అంటే మిగతా కొన్నిటిమీద నాలుగు రోజులున్నంత మాత్రాన ఏదో నీకూ కొంత అధికారం సంక్రమించినట్లుగా ధ్వని స్ఫురింప జేస్తున్నావులే.

నారా : అయితే పొరపాటే, క్షమించు.

విమల : ఇంతకూ ఆ పుస్తకం యేమిటో చెప్పనేలేదు.

నారా : కాఫీ తాగుతున్నావుగా నీవు చూసుకోరాదూ ?

(విమల పుస్తకం తీసుకొని పేరు చదువుతున్నట్లుగా నటించి, కాఫీ త్రాగుతూవున్న నారాయణరావువంక చూచీ చూడనట్లు చూస్తూ)

విమల : ఓహో ... ఇదా ... నా ... నారాయణరావు (నవ్వుతూ) అడవివారు వ్రాసిందిలెండి.

(ఈ సంభాషణంతా అచ్చయ్యగారు చాటుగావుండి వింటూ వుంటాడు)

అచ్చ : (ప్రవేశించి) అవునమ్మా, నీ నారాయణరావే. ఎవరు కాదన్నారు.

(విమల సిగ్గుపడుతుంది నారాయణరావు లేవబోతాడు)

కూర్చో నాయనా లేవడమెందుకు. వయస్సులో చిన్న వాడవైనా గుణంలో మా అందరికంటె పెద్దవు. (ప్రక్కకుర్చీలో కూర్చుంటాడు. విమల తండ్రి కూర్చున్న కుర్చీపట్టుకుని నుంచుంటుంది) ఇన్నాళ్లూ నిన్ను అపార్థంచేసుకున్నాను. నిజంగా నీవు చేసిన వుపకారం మరువదగిందికాదు.

నారా : ఇందులో నేజేసిన ఘనకార్య మేముందిలెండి. నా కర్తవ్యాన్ని నే నెరవేర్చాను.

అచ్చ : నిజమే నీ కర్తవ్యం నీవు నెరవేర్చావు. యిక నా కర్తవ్యముంది.

నారా : మీరుమాత్రం తక్కువ చేశారా. ఈ పదిరోజులూ ఎంతో ఆప్యాయంగా జూశారు. కృతజ్ఞుణ్ణి. ఇవ్వాళ సాయంకాలం సెలవిప్పిస్తారా ?

అచ్చ : (నవ్వుతూ) ఎక్కడికి ?

(శాంతమ్మ ప్రవేశిస్తుంది)

శాంత : ఎల్లాం నాయనా ఇప్పటికే పదిరోజులయింది. కన్న బిడ్డకు చేయించినట్టు ఎంతో శ్రద్ధగా వైద్యం చేయించారు.

అచ్చ : ఏమక్కయ్యా ! రావడం మీవంతే మళ్ళీ పోవడం మీవంతే.

విమల : అవునమ్మమ్మా; మీరుంటే ఎంతో సందడిగావుంది.

శాంత : చిన్నపిల్లవు. నీకు తెలియదులే అమ్మా ! బాగుండదు.

(అచ్చయ్య నవ్వుతాడు. పుల్లయ్య కాసిం ఇతర రైతులు ప్రవేశించుతారు.)

కాసిం : ఏం భాయీ, అచ్ఛావుండావ్.

నారా : ఆ కులాసాగానే వుంది భాయి. పుల్లయ్యా మామా జమీందారు సంగతేమన్నా తెలిసిందా ?

పుల్ల : పట్నం పారిపోయాడంట.

అచ్చ : ఇకనేం. ఆరాత్రి అక్కడే వున్నట్లు ఋజువు చేయడానికి ఏ తప్పుడు సర్టిఫికెట్టో పుట్టిస్తాడు.

కాసిం : అచ్చయ్యగార్కి జమీందార్కి మతలబ్ అచ్ఛా మాలుమ్.

నారా : తక్కిన యిద్దరు రౌడీలెవరో తేలారా ?

పుల్ల : ఆ తేలక యెక్కడికి పోతారు. నాగేంద్రాన్ని, పిల్లి భీముణ్ని పట్టుకొని మెత్తగా తంతే మిగతావాళ్లిద్దరి పేర్లు కూడా బయటపెట్టారు. నలుగురూ యిప్పుడు సబ్ జైల్లో వున్నారు.

కాసిం : హిక మనసైతాన్ వద్దీపోయింది. హిప్డు వాడ్కీ తలిసేవాడు ఒక్డూభినై.

కోట : మన పక్కవూళ్ళోనే కాదు. చుట్టుపట్టూళ్ళల్లో జనం అంతా సంఘంలో చేరారు.

వీర : మొన్న గోవిందపురం వెళ్ళితే అంతా మన నారాయణ రావును తలిసేవాళ్ళే.

అచ్చ : నాయనలారా! మనందరం రైతులం. ఒకోళ్ళ కొకళ్ళం అండాదండగా వుండాలని గుర్తించక జమీం దారుకు బాసటగా నిల్చి పొరపాటు చేశాను. అందు కిప్పుడు విచారపడుతున్నా. నేటికి సంఘ శక్తిని గుర్తించాను. నారాయణా! ఈ విజయ చిహ్నంగా నా యింటిముందు నీ చేత్తోనే జెండా ప్రతిష్ఠాపన చేయమని కోరుతున్నాను.

నారా : నిజంగా మనమొక గొప్ప విజయం సాధించాం. ఇందులో యేమీ సందేహం లేదు. అయినా యింత మాత్రానికే మనం గర్వపడగూడదు. మనం చేయా ల్సినపని యింకా చాలావుంది. ఎన్ని కష్టాలొచ్చినా

అవసరమైతే ప్రాణాలర్పించైనా సరే, యీ జెండాను కాపాడుకోవాలి. ఈ జండా నీడనే నిల్చి మనం మన లక్ష్యాన్ని సాధించగలం. (జెండా నెగురవేస్తూ) బోలో రైతుసంఘాలకి జై (అందరూ అందురు.)

కాసిం : జీహా, గొప్పవిజయం సాధించాం. ఇందుక్కా హాకీ రోజు పులావ్ సేయలా మనుసావుంది. మాదీబీబీ బల్ హుషారుగా వుంది పులావ్ సేసేదాన్కి. (దీనంగా) కాని, చావల్ నై.

అచ్చు : కాసీం మీకీసమయంలో బియ్యం లేవనే విచారమెందుకు? బియ్యమే కాదు. కావలసిన సామగ్రంతా పంపిస్తాను. నీయిష్టం వచ్చినట్లు జలాసా చేయించు.

కాసిం : అచ్ఛా సలాం.

పుల్లి : అయితే రేపు కాసిం యింటికాడ మాఅందరికి పప్పు భోజనమన్నమాట

కాసిం : ఏకోన్ రే! నాకీపులావ్ చేస్తావుంటే పప్పుపప్పూ బోల్తేక్యా. (అందరూ నవ్వుతారు.)

అచ్చు : సరే, రేపు కాసిం యింటివద్ద. యివ్వాళ మాఇంటి దగ్గర విందు. యీ సంతోష సమయంలో మీఅందరికీ ఒక శుభవార్త వినిపించదలచుకొన్నాను. ఊళ్లో వున్న రత్నాన్ని గాజుపెంకనుకొని యెక్కడెక్కడో

తిరిగాను. ఇన్నాళ్ళనుంచి విమల అంతర్యం తెలుసు కోలేక పోయాను. పెండ్లికి ప్రేమ ప్రధానంగాని, డబ్బు ప్రధానంగాదని నేటికి గుర్తించాను. నారాయణా! నీ ప్రాణాన్నికూడా లక్ష్యం చేయకుండా యీ విమలను నీవే కాపాడావు. నీకే అర్పిస్తున్నాను. స్వీకరించు. (ఇద్దరి చేతులు కలుపుతారు.)

కాసిం : నారాయణ భయ్యా! రేపు మా యింట్కీ మీది బీబీతోకూడా పులావ్‌కు రావాలి. మాదీ బీబీ, మీదీ బీబీ పలామత్ షేయవాలి.

నారా : బోలో, స్వతంత్ర భారత్‌కు జై.
రైతు సంఘాలకు జై (అందరూ అంటారు.)

యమన్ - దాద్రా

కదలి రండోయీ వేగముగా కర్షకులారా
అదేనోయ్; అదేనోయ్; అదే అరుణపతాకం
కరువు కాటకాల నణసి కాపాడును యీ జెండా
పరుల పీడబాపి మనల దరికీజేర్చు నీ జెండా,
ప్రజల కండదండ యీ పతాక మిదేనోయ్ ॥కదలి॥

నారా : మూఢ భావముల వదలి ముందడుగు వేయుడోయీ

అందరు : మూఢభావముల వదలి ముందడుగు వేయుడోయీ

విమల : కలసిమెలసి కదలుడోయీ, కాలహరణ మేలనోయీ

ముందడుగు

అందరు : కలసిమెలసి కదలుడోయీ కాలహరణమేలనోయీ
కష్టమెల్ల మాని యిపుడె దీక్ష బూనుడోయ్:
ఇపుడే దీక్ష బూనుడోయ్ ఇపుడే దీక్ష పూనుడోయ్
అంతఃకలహము లంతరింపగా, ఐక్యముగండోయీ,
అంత్య విజయమును సాధింపంగా అందరు రండోయీ
ముందుకు రండోయీ! ముందుకు రండోయీ;

సమాప్తం

**MUNDADUGU** Price **Rs. 1.25**

# నాటకాలు - నాటికలు

| | | |
|---|---|---|
| భూమికోసం | సుంకర సత్యనారాయణ | రు. 1.25 |
| వీరకుంకుమ | ,, | 1.00 |
| ప్రతిఫలం | ,, | 1.00 |
| ఓ ఎవరికి ? | అనిశెట్టి | 0.25 |
| అంత్యార్పణ | ఆత్రేయ | 0.25 |

## త్వరలో

మాభూమి సుంకర, వాసిరెడ్డి.

( పోస్టేజి అదనం )

ప్రతులకు :

**విశాలాంధ్ర ప్రచురణాలయం,**

బకింగ్‌హాంపేట (పోస్టు) : : విజయవాడ.

Wrapper Printed at Swatantra Art Printers, Vijayawada-2.

